శ్రీ మత్పరదేవతాయై నమః

శ్రీ

# * మల్లేశ్వర విజ్ఞప్తి *

(శతకమకుటకావ్యము)

రచన:

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి, శతావధాని

ప్రకాశకులు:

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి సన్సు

వేంకటేశ్వర పబ్లికేషన్సు

కడియం - P. O.

తూర్పుగోదావరి జిల్లా -

## * హెచ్చరిక *

1920 సం॥రం ప్రాంతంలో ప్రారంభింపబడి 1930 సం॥రం లోగా ముగింపబడినట్లు అనుమానింప బడుతూన్న యీగ్రంథ రచనకు కారకు లెవరైనదిన్నీ సప్రమాణంగా తెలియనప్పటికిన్నీ "శాపాదపి - శరాదపి" అనే న్యాయానికి ఉదాహరణ ప్రాయంగావుండే యీ గ్రంథంలోని స్వరూప స్వభావాదులననుసరించి, గుమ్మడి కాయల దొంగలవలె యెవరున్ను బుజాలు తడుముకో కూడదనిన్నీ, అముద్రితములైన గ్రంథకర్తగారి గ్రంథాలన్నీ ముద్రించడమే ప్రకాశకుల ముఖ్యతాత్పర్యంగాని వేఱేమీకాదనిన్నీ పాఠక లోకానికి మా విన్నపము.



వెల
1-4-0



మొదటికూర్పు:
వెయ్యిప్రతులు
1955

ముద్రణము:
వేంకటేశ్వర ప్రింటింగు ప్రెస్, ఆలమూరు.

# * కథాసంగ్రహము *

—————//—————

అనగా అనగా ఓవూరు. ఆవూళ్లో దేవుడిపేరు మల్లేశ్వరస్వామి. ఆయన్ని పూజిస్తూవుండే పూజారి వంశములో వొక ప్రబుద్ధుడు పుట్టేడు. ఆప్రబుద్ధుడికే పూజారి అనీ లెంక అనీ, పేళ్లు ఇతనికి లౌక్యంలో మంచి ప్రజ్ఞవుంది. అందుకే ఒక బ్రాహ్మణమాన్యాన్ని ఒకగొల్ల రహితుద్వారా రాజేసి అందులో వకవాటాకూడా అక్రమంగా సంపాదించాడు.

యితగాడికి కుంకలతో చాలా స్నేహంవుంది. యీకుంకలు సంఖ్యకు అయిదుగురు అందులో పెద్దవాడు లెంకకు అన్యాయకార్యాలుచేసే వ్రిస క్తిలో కుడిబుజంవలె ఉంటుండేవాడు. యీకుంకల కావూళ్ళో వకచోట ఊడుపు (మాగాణి) పొలం వుండేది. ఆపక్కనే యీగ్రంధకర్తకున్నూ వుండేది. యింకోవైపున పుణోమంగలికిన్నీ వుండేది. యీచేలకు నీరువచ్చే నిమిత్తం అక్కడొక బోదికాల్వ ఉండేది. అసలు తగాదా దానిదగ్గరే గ్రంధకర్తకున్నూ కుంకలకున్నూ ఓంప్రథమంగా ప్రారంభమైంది. స్వతహాగా కుంకలు తుంటర్లే అయినా అంతకుముందు గ్రంథ కర్తకు విధేయులుగానే వుంటుండేవారు. కుంకల్లో వొకడు గ్రంధకర్త వద్ద శుశ్రూషకూడా చేసేవాడట బోది తగాయిదా- రాజీకిన్నీ అతీతమై అప్పట్లో గ్రంథకర్త ఆభూమిని అన్యాక్రాంతం చేయడంతో ముగిసి పోయింది.

అవునా : యిదిల్లావుంటగా అవూళ్ళోనే బ్రాహ్మణ కులంలోనే వ్యభిచారంలో ఆరిందాగా సంచరించే వొక యేబ్రాసి వుండేది. ఆవిడితో కుంకల తండ్రికిన్నీ కుంకలలో కొందరికిన్నీ గూడా సంబంధం వుండేది. ఆసందర్భముచో కొంచెం గ్రంథకర్తచే మందలింపబడ్డ కుంకలు ఆ గ్రామములో యేకొంచెమో అనాటి సంఘకట్టుబాట్లద్వారా న్యూనతగా చూడబడుతో వుండిన్నీ వెలిపూత్రిం వేయబడకుండా సంఘంలోనే

కలిసి మెలిసి వుంటూవచ్చారు కాని గ్రంథకర్త మీద లోలోపల వీళ్ళకు అక్కసు మాత్రం వుండేది. గ్రంథకర్త ఆనాటికి బందరులో ఉపాధ్యాయవృత్తి విరమించుకొని విశ్రాంతిగా కాలంగడిపేనిమిత్తం స్వగ్రామం చేరుకొని వున్నాడు యీయన చేరుకొనేనాటికే గ్రంథంలోని గ్రామపాచకుడున్నూ ఆగ్రామంలోనివసిస్తో అన్నంలేని కారణంగానో, ఆనాటికి కుటుంబములేని కారణంగానో ఆగ్రామంలోని "స్వైరిణ్యగ్రణి" గారింట్లోనే ఉంటుండేవాడు. పూరికే, ఉండడమేకాక ఆవిడతో సంబంధంతోనే ఉండేవాడు. ఇతను క్రమశః, లెంకతుంకలకు తుంటరితనంలో ప్రధానహంగుదారుగా ప్రవర్తిస్తుండేవాడనేది సారాంశం — ఈగాథ యిలావుండగా ఉద్యోగరీత్యా అవూళ్ళోకాపురం చేస్తూవున్న బ్రహ్మబంధు వొకాయన స్వగృహములో పెళ్ళిచేస్తో గ్రామంలో వుండేయావన్మందినీ ఆశీర్వచనానికీ భోజనానికిన్నీ పిల్చాడు బ్రహ్మబంధువంటే ? బ్రహ్మసమాజమతస్థుడన్నమాట యీలాటి సంస్కారాలకింకా ఆనాటికాలం అనుకూలం కలది కాకపోవడంవల్ల ఆ గ్రామంలోని బ్రాహ్మణ్యమంతా ఆ పెళ్ళిలో యేవిధంగానూ పాల్గొనకూడదనీ నిశ్చయించుకుంది. కానిఆనిశ్చయానికి అంతిమ ఘట్టంలో వొక విఘాతం వచ్చిపడింది. యెల్లాసంటే గ్రంథకర్తకు గురుపీఠంలో వుండే పరమపూజ్యులు కొండబు ఆసంస్కారణ వివాహానికి ఆహూతులై వచ్చివున్నారు - వారితోపాటుగా గ్రంథకర్తయున్ను కలిసివెళ్ళకతప్పదు - అందుకని - తానుచెప్పితేవినే గ్రామంలోని బ్రాహ్మణ్యానికంతకీ వర్తమానించి - తానుగూడా ఆవివాహంలో పాల్గొని యీదిగువ ఆశీర్వచన పద్యాలుకూడా చెప్పడం జరిగింది ఆ యీ పద్యాల భావాన్ని పరిశోధిస్తే ఆనాటి గ్రంథకర్త హృదయ మథనమనమే గ్రహించవచ్చు —

శా. ఘోరంబైన తపంబొనర్చి, అనలాక్షున్ మెచ్చఁగాఁజేసి. త
ద్ధీరత్వమ్ము సడల్చి - కాయజునకున్ దేహాంతరప్రాప్తి చే
కూఱన్ జేసి - రతిన్ గలంచిన కుభృత్కూటస్థలావాసి -సీ
తారామాఖ్యవధూమణిన్ మనుచుఁగాతన్ రామకృష్ణాఖ్యునిన్.

శా, సారాచారుని - ఛాందసుణ్ - దసపతిన్ సంసారసాహిత్యపున్
గారాబంబున మగ్న మానసునిగాఁ గావించి సంసార సం
సారం బిట్టిదటంచుఁ దెల్పిన సరస్వత్యంబ ప్రేమించి - సీ
తారామాఖ్యవధూమణిన్ మనుచుఁగాతన్ రామకృష్ణాఖ్యునిన్.

యీపద్యాలలో యిమిడ్చిన కల్పనవల్ల గ్రంథకర్త హృదయం సుగమమే కనక విస్తరించేది లేదు. ఆ యీ హృదయాన్ని తెలుసుకోవడం చేత కాని లెంకయున్ను కుంకలున్ను గ్రామపాచకుడున్ను గ్రంథకర్తను దూషించడానికి వుపక్రమించడంతో అంతకిత్రం బోదెకాల్వతో ముగిసిపోయిన వైరం మళ్ళీ తలెత్తింది-. అదే మల్లేశ్వర శతకపుటానికి అంకురార్పణయై రకరకాలైన తరహాలలో గ్రంథకర్తను బాధించిన తుంటరుల దుష్టకృత్యాల స్వరూప స్వభావాల వర్ణనలలో ఆఱు వందల పద్యాలవఱకున్ను పెరిగి, ధారాశుద్ధితోపాటు వాక్శుద్ధిన్నీ గల గ్రంథకర్త కోరికలను అనఁగా, శత్రువులు అనుభవించదగిన శిక్షలను గ్రంథకర్త కోరినప్రకారంగా అమల్లేశ్వరుడు పూర్తిచేయడమువల్ల అలా పూర్తిచేసినట్లు విశ్వాసంగల గ్రంథకర్తచేత అ యీ గ్రంథం ముగింపబడింది.

.... వి ష యా ను క్ర మ ణి క ....

1 వ పద్యం మొదలు - 54 వ పద్యం వరకున్ను పూజారి విషయమున్ను ఆనాటి మల్లేశ్వరుని స్థితిగతులున్ను చిత్రించబడినవి. 55 నుండి కుంకల్లో వొకని ప్రవేశముకల్గి. వాని సహాయం, లెంకకు ఏవిధంగా ఏర్పడుతుందేవో వివరింపబడుతో 113వ పద్యందాకావెళ్ళి 118 నుండికుంకల వంశవర్ణన ప్రారంభమై 124 తో ముగుస్తుంది 126వ పద్యంలో వచ్చిన బడే తిలఘాతకుడీ గ్రంథంలో పాత్రధారి కాకపోయినా గ్రామంలోని ఆజీ తేజిన ఆరిందా లౌక్యుల్లో వొకడుగా పేర్కొన బడినాడు - అంతే - 168వ పద్యంలగాయతు - 172 వఱకున్ను గ్రామపాచకుని విషయం రచింపబడింది. ఏ వివిషయం గ్రంథాంతంలోను గ్రంథమధ్యలోను

కూడా వస్తోనేఉంటుంది - 174వ పద్యం మొదలు వొకసత్రపుగుమస్తా కథ వస్తుంది - ఇతడు కుంకలకు పెత్తంద్రికొడుకు. వీని చరిత్ర 190 వ పద్యంవఱకున్ను వుంది, 193వ పద్యంలో - అసలు కలహకారణం చెప్పబడివుంది. 167 లో బ్రిహ్మబంధువిషయం సూచింపబడినది. 260 వపద్యంలోని గాధ - ఏమిటంటే : ఒకబడిపంతులుద్వారా లెంక - గ్రంధకర్తకు నష్టం గలిగించడానికె యత్నించి, ఆపంతులు పెట్టీబాగుల వాడుకావడంవలన విఫలుడై నాడనీ, ఆదాసీరండకు కొంపకట్టడం కుదరలే దనీగ్రిహించాలి 358వ పద్యంలోనిది వొక శూద్రస్త్రీ ఆజన్మబ్రహ్మ చారిణి ఉత్తమురాలు 362 లోని వైరం ఆగ్రామంలోనే వొక సంప న్నగృహస్థునితో కుంకలకేర్పాటై - స్థలఖాండవిసర్జన కెంతో తోడుపడి నటు జనశ్రుతి 455 లో అయివైర హేతువుగానే గ్రామంలో గ్రంధ కర్తనభిమానించే వ్యక్తులు గ్రింధకర్తకు చేసిన గౌరవమని గ్రిహించు కోవాలి, 470 లో గ్రంధానికి సంబంధించినంతవఱకు కథ అంతా క్రోడీకరింపబడివుంది. యింకా కొన్నివిషయాలు ప్రసక్తానుప్రసక్తంగా అక్కడక్కడ తగులుతూ వుంటాయి వాట్లకు సంబంధించిన సందేహాలన్నీ ఒకటి రెండు మాట్లు గ్రంథం పఠించినట్లయితే తీరిపోయేవేకనక ఆలా చేయవలసిందిగా పాఠకులకు హెచ్చరిక —

యీదిగువ పదాలు గ్రంథములో యెక్కడ వచ్చినా అవిఅన్నీ కుంకలకు పర్యాయ నామధేయాలని గ్రిహింపగోరుచున్నాను.

1 కుంకలు 2 రండలు 3 జారాత్ములు 4 మూఢాత్ములు 5 కూళలు 6 మందాత్ములు 7 పుష్టలు 8 కంకోష్టులు 9 బంధులు 10 విమనులు 11 చండాలురు 12 తుచ్ఛులు 13 దుర్జాతులు 14 అజ్ఞాత్ములు 15 హీనాత్ములు 16 వ్రాత్యులు 17 దర్పాంధులు 18 భషకములు 19 యోగ్యేతరులు 20 కష్టాత్ములు 21 ముండాకొడుకులు 22 దున్నలు 23 రండాకొడుకులు 24 రౌడీలు 25 మొప్పెలు 26 వదరుబోతులు 27 ప్రేతన్నలు 28 ఖలులు 29 నీచులు 30 బూతుంబుంగలు 31 ఎనుబోతులు 32 దరి

దుర్గిలు 33 జడులు 34 దద్దమ్మలు 35 ఉచ్ఛిష్టులు 36 కాఋమన్నలు 37 చౌరాచారులు 38 సాహాత్కారాయులు 39 అపమారాతులు 40 అన్యా యపుంబీసుగులు 41 కూర్గిరాదంభణులు 42 బంటాకులు 43 అనామతటు వులు 44 చండాలకాభాష్పణాటోపులు 45 వెఱ్ఱిపీర్గులు 46 ద్రావులు 47 బకపర్యికృతులు 48 బరియా కుక్కలు 49 ఈసకాలాపులు 50 వాజ మ్మలు 51 శ్రేయోమూడులు 52 పెందేల దేవయ్యలు 53 గర్వగ్రంథులు 54 మాదర్చోదులు 55 చెవలమ్మలు యిత్యాదులు —

పై నామధేయాలలో కొన్ని కేవలమూ కుంకలకు మాత్రమే కాక గ్రామపావక లెంకలతో కూడిన కుంకలకున్నూ పర్యాయ పదాలుగానే అక్కడక్కడ వాడబడుతోవచ్చాయి అదిగూడా గమనించు కోవాలి - ఆ యీగ్రంథంలో వ్రాయబడిన కుంకలు వగైరాల దుష్ట కృత్యాల జాబితాకూడా వ్రాసి మఱిదీన్ని ముగిస్తాను,

1 దైవానికి అపవిత్రాన్నం నైవేద్యం చేయుట 2 దేవాలయంలో సంధ్యాదీపం పెట్టకుండుట 3 దేవుని ఆస్తి తాకట్టపాల్జేసి సంచరించుట 4 మంచివారిమీదికి రౌడీమూకను ఉసికొల్పుట 5 గ్రంథకర్తపై అబద్ధపు కేసుపెట్టుట 6 గ్రంథకర్త ఆధ్వర్యంలో నడిచే పాఠశాలలో అసహ్యా ప్పనులు చేస్తో ఉపాధ్యాయుణ్ణి నానాకూతలుకూసి బరిసాగకుండా ఆటం కాలు కల్పించుట 8 గురువైన గ్రంథకర్తను అడ్డమైన తిట్లు తిట్టు చుండుట 9 గ్రంథకర్త వద్ద విద్యాభ్యాసముచేసే శిష్యుల్ని తిట్టుటయున్ను కొట్టుటయున్ను 10 గ్రంథకర్త యింటిని కూల్చేనిమిత్తం ఎన్నో ప్రయత్నాలు చేయుట 11 గంథకర్త తాలూకు యింటిలోని సామగ్రిని పగటి దొంగలై దొంగిలించుట 12 గ్రంథకర్త నివాసగృహంలోకి పం దుల్ని తోలుట 13 గ్రంథకర్త తాలూకు మూడుపశువుల్ని బలవంతంగా కట్టి బాధించుట 14 గ్రంథకర్తను "వెఱ్ఱి వెంకయ్య" అనుట 15 "తరవాణి" అంటూ గురువైన గ్రంథకర్తను హేళనచేయుట 16 ఆగ్రామములోని ఒక మద్దంగి భార్యతో సంపర్కం కల్పించుకొని

వడ్రంగి సోదరులకు అకృత్రిమ విరోధం సృష్టించి చివరికి భార్యాభర్తలకు సంబంధములేకుండా చేయుట 17 శ్రీరామచంద్రునికి ఆలయనిర్మాణం చేసి అందు హరిజన ప్రవేశ సంస్కారంచేసి అంతతో తృప్తిచాలక ఆఆలయాన్ని చివరికి పశువులశాలగా మార్చుట 18 ఖిచ్చమెత్తుకొనే ముష్టివానిపై మీసంత్రిప్పి చావగొట్టి శౌర్యప్రదర్శనానంతరం దానిచే శాపనార్థాలు తినుట - ఇల్లాంటి వెన్నో ఉన్నాయి ఎంతవ్రాసినా విషయ మింతే — స్వస్తి !

జయ - మహాశివరాత్రి
20 - 2 - 1955.

విద్వాన్
చెళ్లపిళ్ల దుర్గేశ్వర శాస్త్రి

---

(షరా) ఈ దిగువవిధంగా కూడా ముద్రాప్రమాదములు - సవరించు కోవలెనని ప్రార్థింతుము ....

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 26 | 10 | లునన్ | లనన్ |
| 27 | 15 | రిద్య | రిద్ర్య |
| 41 | 11 | ల్తువె | ల్తురె |
| 45 | 21 | ధ్యాన | ధ్వాన |
| 61 | 21 | కెడపస్ గోరంతయున్ | కెదలోఁ గించిత్తునున్ |
| 87 | 16 | గీర్వా | గీర్వా |
| 93 | 18 | ర్మశ | ర్మ |

శ్రీమత్పరదేవతాయైనమః

# మల్లేశ్వర విజ్ఞప్తి

## * బోదెకొల్వా *

ఉ. బోదెవు నీవుకావు మరి బోధపదెట్లన నీదు శాఖలో
లేదువినీతి, యోగ్యతయు లేదు, ఋజుప్రతిపత్తి పూర్వమే
లేదు కృతజ్ఞతాగరిమ లేదు, గురుప్రవరాంఘ్రిభక్తియున్
లేదని బోధచేసితి ఖలే ? యిఁక వర్ధిలు బోదెకొల్వరో 1

ఉ. జేసెఁదా ? జెత్తెఁదో ? కలవు చేసిన బోధ యపార, మింత వి
జ్ఞానముమున్ననేఁ జదువు శాస్త్రము లేనియుబోధసేయలే
దోనెఱజాణ ? నీ కతన నొందితి నింతకు శాఖ తత్త్వ మిం
కేను నినున్నుతించి కృతకృత్యుఁడ నయ్యెద బోదెకొల్వరో ? 2

ఉ. నీగతి నీప్రవర్తనము నీవగు లోతును నీదుపాతు నీ
లోగడ సున్కియున్ సకలలోకులకున్ విశదంబులయ్యెను
న్నాఁగఁ బ్రియత్నమున్ సలిపినట్టి ప్రబుద్ధుల తెల్వితేటలున్
జేగయుఁ బ్రాక్షాలెల్లను నినీ ? యని రోసిరి బోదెకొల్వరో 3

ఉ. పంకము నీ యెడంగలుగు పద్ధతి యుక్తము కాని నీకొగిన్
సంకెల వేయఁజూను నరిస్వాంతము పంక మొనర్చితెట్లు నీ
కొంకది నేనెఱుంగుదును గొంకకు సంధిని గోరినంత నీ
వంకకు దేరి చూడఁగల వాఁడొకఁడుండఁడు బోదెకొల్వరో 4

మన్నయిపోకయున్ననను మానక వేఁడాక పేరఁ బిల్వ మ
న్నన్న? యధర్మ మెప్పటికి నాఁగదు ధర్మము మూఁయు బోదెరో 11

మ. కడుఁ జాలైన పరిదేశ మిప్పొవల జక్కన్నాక పిశాంతి యే
ర్పడు నంచున్ గడియమ్ము వచ్చితని యుద్ధ్యోగల్పూరవారేయు వి
య్యొడఁ గూడఁ జని చెప్పుచుండిరని యెంతే లోన జింతిల్లియున్
గడుసుం బోకలు మించినప్పు డెటు లోకాలుఁ మసల్ తప్పునే 12

మ. కలహం బియ్యది బంధుసర్గమునకుఁ గారాదుగా! యంచునే
నలుకన్ లోఁగలుగంగ నీక యలవాం ధర్మన్యాయమార్గమ్ము లెం
తలుగాఁ ద్రొక్కిన నైఁచితిఁ గడఁగిసంధానింప యత్నించితిన్
బలవద్దైవము కారణంబగుట నవ్వారొప్పరే త్రోవకున్ 13

ఉ. ముప్పదితొమ్మిదేడులకు మున్నటి నుండియు నున్నవిమ్ము మా
యప్పరో? నేఁడు పూడ్చుటకు యత్నమొనర్చెడి వారి నైపుణిన్
తప్పక వర్ణనీయములు తథ్యమెఱింగియు శిష్యులయ్యె వాం
డ్రిప్పని పూను హేతువది యెట్టిదొ? తెల్పుము బోదెకాల్వరో 14

మ. అకలంకమ్ముగునట్టి నెమ్మనముతో నస్మత్ప్రయత్నమ్ము ని
త్య కలంకమ్మగు నూహతో నొరులు సేయంబూను యత్నమ్ము దీ
నికి బాహ్యమ్మగు కారణమ్మొకటియున్నే నేర గుర్తింప యుం
తకు నద్దైవలకిట్టి దుష్కవమలట్ గాపైన వేహేతువో 15

మ. కపటత్వమ్ము వహించు కారణమదిన్ గన్పట్టి చింతేసియున్
విపులత్వమ్ము వహించి వర్ధిలుము పృథ్విన్ జాలఁబెట్టాంసి: యా
చపల స్వాంతు లొనర్చునట్టి పనిలేకంబేనియున్ లేదని
కపకారం బొనరింప నేరికి నసాధ్యంబమ్యెడిన్ బోదెరో 16

ఉ. పారబడానఁ బెట్టికొని పాఱెడు నీరుఁ గలట్టి నీకు నొం
పాఱఁగఁ బాడ్చెనెవ్వఁ డతఁడప్పని చేసినపై వ్యథాగన
న్నొరికొలందులా వెఁటామి నోరటు జాజెష నప్పుడెంతటో
యూరివివేకులుండి రిసిపో? యని చెప్పవిరోసి బోదెరో? 17

మ. మునుదుర్వాసుని యాదవార్భకులెటుల్ మోసమ్ముమైదీరి కూ
ర్పుని వంచింపఁగడంగిరో యటులె శిష్యుల్ "జానెఁడే మూరెఁ"
యని నిన్నున్ గురియించి హాస్యరచనా వ్యాహారమోహాంధు
పనినాకున్ గలిగించుచుండిరి వృథావ్యాపారమే పోరఁగన్॥

శా. యావత్కాలము నీవృథాకలహ దుర్వ్యాపారపున్ బీజమున్
జావన్ జేయమి గొప్పముప్పనుచు నే సంధింపఁగానెంచి లా
భావిర్భావముఁ జూపినన్ వినరదేమన్యాయమోకాని యో
దేవీ ? వారలతత్త్వమే వెలుఁగుచోఁ దెల్పంగదే బోదెరో ॥

శా, నీలోతెంతయొ వారెఱుంగుదురుకానీ వారిలోతెంతయో
నీలోనైనను నీవెఱుంగవొకో ? నీ నీచోపసర్పత్వమె
ట్లోలిన్ వారికొసంగి డీల్పడితివో యొక్కింత వాకుప్రిచ్చుమో
స్థూలంభావుకతాపదోస్మ్మఖపయస్తోమాఢ్యమా బోదెరో॥ 2

ఉ. మంగలిదొక్కప్రక్క మనమాన్యులు వేఱొకప్రక్క నొక్కనీ
కుంగలలోతుఁ జాతగలి కూలితి కూలుచునుంటి వేసు ని
న్నుంగనినాఁడ నీదగుమనోరథమున్ గనిపెట్టినాఁడ నీ
వెంగలిచర్చలో నడుగువెట్టుట కిష్టములేదు బోదెరో॥ 2

ఆ. వె. కోట్టకరుగ నొక్క కొనగోటిమాత్రిఁకోఁ
దీరుపనికినీవు దేబెవగుచు
నప్రతిష్ఠనాకు నంటగట్టెదవేల ?
యంచు నేటికేడ్చెదమ్మ? బోదె ? 23

ఆ. వె. అప్రతిష్ఠ నీకనాదిగనున్నదే
యేనుదానిఁదెచ్చి యీయనేల ?
ఉన్నయప్రతిష్ఠ యూడ్చిపెట్టుటకునై
వారు పట్టుపట్టినారుకాని॥ 23

శా. నీ కేదారము నాదుజీవనముచే నేనెన్నియో వత్సరాల్
సాఁకన్ బండుట నీవెఱింగియును నాపావివు నైరించుచో

నీకుండాఁకదొకో ? కృతఘ్నత కడున్నిపాతకేపంబు త
త్పాకంబెట్లు భరింతు వంచడుగుటల్ ధర్మంబగున్ బోదెకో॥ 24

చ. ఒరులు కృతఘ్నులైన మదినూరకపొక్కెడి నిన్నువంటి ధీ
వరునకుఁ గూడఁ గైకొనఁగవచ్చునె ? యిట్టికృతఘ్నతా మహా
దురితమటంచు నీవడిగెవో ? యది యట్టిదయౌట నామసం
బెఱుఁగు, నెఱింగియేమిఫల ? మేనలవారికె లొంగిపోయితిన్॥ 25

మ. గురుభక్తిన్ జరణమ్ములన్ దుడిచి దుష్కోపాన నిన్ బాప్పు న
ద్దురుసుంబాకమువారితోడఁ గడువృద్ధుండైన నేనెట్లు సం
గరమున్ జేయుదు? నీయెడనమ్మదిఁ గృతఘ్నత్వంబు గైకొంటిమే
వర, మా భారము పూనుచో ఘనులునవ్వన్ బాలుగాకుండునే॥ 26

ఉ. కాలలవారు తిప్పుటయుఁ గాలువనేనును ద్రిప్పుచుంటయున్
జేలతనంబు వాయొకటిపెప్పఁగఁగాక మఱేమి ? తుల్యులే
యీలలిఁ బోరు నిర్వరని యెల్లరునవ్వుట కొప్పు నంకపం
డాలము లేకృతఘ్నత గనంబడనీయవు నాకుఁ గాల్వరో॥ 27

శా. అలనాడల్ల వసిష్ఠధేనువును విశ్వామిత్రుఁడన్ జేఁడు దు
ర్లలితుం డాత్మవశమ్ముజేసికొనఁ దాలక్షింప కమ్మౌని నీ
వలెనే యుండఁగ నేమియయ్యె నటులేవారిన్ విదారించి నే
నిలువన్నెత్తు నటందువో ? నిలువు నీనేర్పేను వర్ణించెదన్॥ 28

ఆ. వె. సత్తరువులుచెఱుచు సన్మార్గులకుబోదె
కాల్వగప్పు నెంత ఘనతరంబు
"తల్లిచెవులుతెంచు ధన్యాత్ములకునెందు"
బిన్నతల్లిచెవులు బీఱపువ్వులు॥" 29

క. బోదెలునూతులుఁ జెఱువులుఁ
బాదగలన్ దవ్వఁజేయుఁ బ్రాజ్ఞుఁడితడుఁడా
హ్లాదపడువాని నూడ్వఁగ
మీఁదెఱుగనివానిచె యిదిమేదిని నవ్వన్॥ 30

ఆ. వె. బోదెకాల్వలూడ్పుటాదినుండియు నెందుఁ
గలదుగాని బోదెగట్టులూడ్పు
కక్కురితిని జూడఁగాదేమ నేఁటికె
నదియుఁజూపెఁ గలిమహాత్మ్యచర్య॥

ఉ. మొరకుల వెంబడించి కొనిమోసపుప్రత్తిఁ జొచ్చియెట్లొ ప
ర్భరమగు పొట్టనింపికొనఁ బాల్పడువాండ్రకు దేవుఁడన్నమున్
గురువనిసన్ మనమ్మునకు గొంకుచయింపదు చోఁమతేనియున్
వరమనుకొమ్ము వీరల యపాత్రతలెంచిన నుంత బోదెరో॥ 32

మ. గురుసాహాయ్యము మంచిమార్గమునకుం గొంపోవువార్గత్యపుం
దరికీడ్చున్ శనిసాయము, మిందుమనము స్తంత్రజ్ఞులే సాయమున్
శరణంబఁదిరొ? నీవెఱుంగవె! భవిష్యచ్చర్య భూతమ్ముచే
నెఱిఁగింపంబడె నీకు నింకవగ పింతేలమ్మ? యో బోదెరో॥ 33

మ. అకలంకుండు శపించె వీరి ననృతవ్యాసంగులన్ బమ్మనా
యక గోత్రప్రవరుండు సూర్యుఁడవి తానల్లంతనేపోదుదా
ని కథాభాగము లోనిచేయగుఁజుమీ నీతోడివై రమ్ము రి
క్తకళాసూచనకాక యేటిపనికీ కాల్వాబలో బోదెరో॥ 34

చ. పఱపురు నాకతాన వరి పండగఁజేసిరికాని యేరు దో
ర్బలమున సస్యుఁ గప్పుటకుఁ బాల్పడినట్టిరుదేరు వీండ్రకీ
యలుకకు నేదికారణమటంచువొ? విద్దియచెప్పుటొక్కచే
కలను మఱొండు కారణము గప్పడచెందును బోదెకాల్వరో? 35

మ. సరియౌకారణమొండు చూపుమనుచున్ శంకింతువే, నొండుచే
దరయన్ వత్సరపంచకమ్మయినఁ దానౌనేరికింగాష్యముల్
పరిశీలించి పఠింపునట్టివి శ్రీమఙ్ఞ బాటింపకేయొక్క వ
త్సరమే చెప్పుట గొప్పతప్పగుచుఁ దోఁచంబోలు నో బోదెరో॥ 36

చ. చిలుకకుఁ జెప్పినట్టులుగఁ జెప్పినసున్ వినరేమిపాపమో?
కలహపుబీజమున్ జనుపుకర్తమునొప్పిన నై జగౌరవ

స్వప్నమటంచుఁ బల్కెదవదేకారణ మిగ్రహమంచు నింత వా
రెలమివహించు కారణమదెట్టిదొ ? దప్పుమెఱుంగ జోసెఫా॥ 37

శా. ఏ వైర్యాపమునీకు నాయెడదయున్నీకుండనీమంచునా
నీచుల్ పూర్తిగఁ బట్టుపట్టిరికదా ? నేనడ్డగానెంతునో ?
నీ ? పండాలమటంచుఁ బోవిడుతునో ? చెప్పంగదే జోసెఫో ?
కావమ్మెనియుఁ జేయనేరని వృథాకాల్లాట నాకర్ధమే॥ 38

మ. అటుదెంతంచు సగౌరవమ్ముగ నుపన్యాసార్థమై పిల్వఁగా
నటుదేశక్తుఁడఁగా, నటంచనెడి నేనత్యల్పుఁడా దీని కో
సరమై కోర్టునకేగుచో ననుఘనుల్ శంకించుచో వారి నె
క్కరణిన్ దృప్తులజేతునంచు మదిలోఁ గంపింతునో జోసెఫో॥ 39

మ. పగవన్ దేనికిఁగాని యందొకఁడు విద్వత్తన్ గడింపంగఁదా
మొగమోటమ్ముగ నాకవన్ మెలఁగునీమ్ముద్గల్ వృథా వాని భా
గ్యగతిన్ దెర్పించిరి "దీనిచేఁ దమకగత్వ ధాత్రిత్వతల్ దప్పునే
మిగులన్ లాభమటంచునెంచిరొ కదే ? మేత్రోలగున్ జోసెఫో॥ 40

ఉ. తమ్మునకన్నలేగ పురిపమ్మదివాక్యముకాక పోమె రా
రమ్మనినేనుబిల్చినను భ్రాతలకున్ దలకందియో ? మొగ
మ్మెమ్మెయిఁజెల్లకో ? చదువనిచ్చువహింపఁడు వెఱ్ఱివాఁడు నా
నెమ్మదితానెఱుంగఁడె గణింతునె ? వైరమువిద్దె చెప్పుచో॥ 41

క. అన్నయ్య యెంతచెప్పిన
విన్నయ్యలుకారు తనకు విధిలేదల వా
ర్చన్నట్లు చసకయనితాఁ
జిన్నమొగమ్మగుచుఁ జదువుచెడగొట్టికొనెన్॥ 42

చ. అదియటులుండె రైలుమునుపాదిని బుట్టిన యష్టపుష్టి య
భ్యుదయమునొందుచున్న సినుజోదెరో ? మావఁగశక్తి మేరికిన్
గుదురదుకాని దీనికయికోర్టుకుఁ బోవుటకిచ్చలేదు నే
నొదిగితి నిన్ను పూదృనకు నోమఁగనిచ్చితి వృద్ధినొందుమా॥ 43

క. ఇఁకనీ పంకజునీదు
ర్వికలాత్ములరారు వచ్చిరేనియు నీతో
సరిఁ దోర్చిసిపూడ్చు చెలుఁగుదు
రెకసెక్కెములుడిగి యుఁమరీపై వైపల్॥ 44

శా. నీకుక్షామంగళమౌత, నీయెడల దుర్నీతిన్ వృథాతాల్చు దు
ర్థీకుల్ గాంచెడిదుర్గతిన్ దెలుపనెంతే సాక్షివై హాయిగా
నేకాలమ్ము నొసంగుచుండెదవుగా, కీకైతనీతోడి పా
టాకల్పమ్ములరారుతన్ బుధుల మెప్పత్యంతమున్ బొందుచున్॥ 45

సమాప్తము

శ్రీమత్సాంబదేవతాయైనమః

# శ్రీ మల్లేశ్వర విజ్ఞప్తి



శా. శ్రీమంతమ్ములు నీకటాక్షములు, నిన్ సేవించువారల్ సదా
సేమమ్ముంగని వృద్ధినందుదురు, దుశ్శీలుల్ వృథా నేయు దు
ర్ధీమంతుల్ తమ దుర్విదగ్ధతకు నెంతేదామె బాష్పాల్ గదా?
స్వామీ? సర్వమెఱుంగు నీకిదెనమస్కారంబు మల్లేశ్వరా॥ 1

శా. పిన్నల్ పెద్దలటన్న భేదము లపంబేనిన్ గనన్ రాదు సం
పన్నుల్ నాస్తిబుజాక్తి పూజ్యము మహాపాపాత్మ కుండిచ్చునా
యన్నమ్మున్ దినకుంట అంకడియ పీతాహార మీయూరనో
యన్నా? యెందులకుండెదో తెలుపుమయ్యా? చంద్రిడీ మల్లేశ్వరా

మ. అవివేకుల్ తినరాని యన్నములు సేయన్ రాని దుష్కృత్యముల్
భువిలోనాస్తి, వివేకులన్ గలిపి యీ బువ్వంపు బంతిన్ వెసన్
దవులన్ జేయఁగడంగుచుండిరి కటా? తత్పాపపుంగూడు నీ
కెవరో యెందుల కర్పకుండెయిడెనస్సీ దేవమల్లేశ్వరా 3

మ. విసమున్ మెక్కిన మేటి వంచెబుఁగదన్ విశ్వేశ యద్దానికి
కసుమాలమ్ము నకెంతయంతర మెుగిన్ గర్భస్థముల్ పేర్పుటీ
విసముం జూచిన మాత్రఁ దెర్శిపడు దుర్భిక్షంబు ప్రాపింపె బట్
వసతుల్ గల్గియు నీకుఁ గర్మగతి దుర్వారంబు మల్లేశ్వరా 4

శా. వేదాఖ్యాన పవిత్రకుక్షియగు నుర్వీ దేవునిం గూడ న
ర్వాదుల్ కొందఱు దీని నెట్లో కుడిపింపన్ జాలయత్నించి త
ల్లోపదప్యంగుడిపించి రి ప్పటికి నేడో రేపో శేషమ్ము సం
పాదింపంగల రిక్కలిపరిష్కృతి కెవ్వారడ్డు మల్లేశ్వరా 5

శా. ఏ కర్మమ్మది కాలియర్చుటని దుర్నీతిస్థితిన్ జేసియో
డోకున్ వోకెడుకూడు భక్ష్య మగునట్టుల్ బ్రహ్మ నిర్మించెఁబో
మా కేమి చెడుకూడు మెక్కుటకు ? నేమంటౌత మిక్కుటికి
న్నీకున్ గూడ, సహింపఁగావలయు మా నేరమ్ము మల్లేశ్వరా 6

శా. దాసీదాస నిరంతరార్చితులు భూదారుల్ భవత్సేవకుం
డీ సంపత్తిని నీకెటో నెఱపె నా యేవంపుఁ గైంకర్య మే
తాసైరింపక నీవులో మిఱుక నేతద్దైన్య మొందబ్బెనే
నీ ? నీ ? దేవునకేనిఁదప్పదుగదా ? చీకాకు మల్లేశ్వరా 7

మ. వసతుల్ జేండ్లిడినట్టి వుండియును నీ ప్రారబ్ధకర్మానసీ
ససిలే నన్నమెకాక దుర్మలినతా సాంకర్య కైంకర్య వుం
గసయున్ బాల్పడి "కాకమాంస"మనుశ్లోకం బెల్ల నీయందె తాఁ
బొసఁగెన్ జింతిలఁ బోకుమీ చెడుఁగెటో పోకున్నె మల్లేశ్వరా 8

శా. హేయాన్నంబిపు డబ్బ నేమియగు ? నీ కెన్నేడు లాయెన్ హృదా
ప్యాయమ్మౌ రుచిరాన్నమబ్బి నిజమున్ వాక్రుచ్చు మో దేవ ; యే
సాయాహ్నమ్మున నీకు దీపమిడెనో ? చర్చింపు మింతేల ? నీ
కీయాపత్తెపుడేని దప్పునొకొ ? మేమీక్షింప మల్లేశ్వరా 9

శా. కూరల్ పప్పును నేయి యన్నమును రక్తుల్ గూడ భక్షింపనే
సారస్యమ్మును లేని య త్తినయ భక్ష్యమయ్యెనే కౌర ? మ
ర్వారంబీ దురవస్థ కాటవసియింపన్ మాని దేవాలయం
బారన్ జేరినఁగాని మానదొకొ ? నీకాకూడుమల్లేశ్వరా 10

శా. దీపం బుంచమి కంత చింతిలముసూ ? దేవా ? భవత్ఫాలనే
త్రోపాగ్నియ బాలనప్పనికి నీకాహారపుంబట్ల నే
లోపమ్మున్నది యున్నియుంగలవట ల్లింగుజ్జ జిహ్వోస్థలిన్
బ్రాపై సిల్పెళ్ళనెళ్ళరుండనుట సంప్రాప్తించె మల్లేశ్వరా 11

శా. ఏసంబంధములేని గేస్తురెటులే నేకూటికే నగ్గమై
దోస మ్మంతగఁ గూర్పదర్పకుఁడు నీతో నిత్యసంబంధి యే

యిాసోలోఁగాని హేయమున్ గుడిచి నీ కీమేవమున్ గుడ్పునే ?
నీ సత్తన్ మదినమ్మఁడన్న గుడియే నిక్కమ్ము మల్లేశ్వరా 12

శా. గ్రామస్థుల్ నిను దైవమంచెఱిఁగి జంకన్ జొచ్చిరేకాని నీ
సామర్థ్యమ్మది యెంతయో యెఱుఁగుటన్ జంకందు పూజారి యో
సామీ ? లింగము రాయి గాఁదలఁచెనో సత్తా విశేషమ్ము లిం
దేమేనిన్ గలవేని యింతతెగునే యిప్పట్ల మల్లేశ్వరా 13

మ. సుర ద్రాఁగున్ దినునంజుఁడం చొరులకున్ జూపించు సత్యవ్రదూ
ప రసమ్మున్ భవదర్చకుం డెఱిఁగియున్ భావమ్ము వంచించి యు
ద్ధురితంపుం జెడుకూడు నిన్నుఁ గుడిపెన్ దుర్దర్పసర్పమ్ముచే
గఱవంబడ్డ కతానఁ దానొకతెఱంగన్ లేమి మల్లేశ్వరా 14

శా. ఎన్నాళ్ళీ చెడుకూటి తో మనెదవో యెన్నాళ్ళు పెంఢీఁకటిన్
విన్నాణమ్ము దొరంగి వర్తిలెదవో ? విశ్వేశ ? పాపద్వయం
బెన్నం దున్నిను పెడునో ? సిరులునీ కెప్డబ్బునో ? తెల్పుమో
యన్నా రాయివి కాక దేవుఁడవె నీవైతేని మల్లేశ్వరా 15

శా. నీ నేత్రాగ్నియె నీకు దీపమనుచు న్నేనంటినే కాని యు
న్లైనినీ గుడికెవ్వఁడేనిఁ జనుచో నిక్కట్టు వాటిల్లు మున్
సూనాస్త్రుం దరుదెంచి రూపఱఁచె ? యోహాలీ ? విచారించుచో
నీ నేత్రాగ్నిని మూయుచే హితమటుల్ నేమింపుమల్లేశ్వరా 16

మ. కనులన్ మూసుక కొంత కాలమెటులో గాఢాంధకారమ్మునన్
మునుకల్ వెట్టుచునుండు మెట్టుల నొయిా ముప్పంతటఁ దీఱునె
ట్లని ప్రశ్నింపకు మర్చకాత్మజుని బాల్యంబంతలో వీదు వా
నిని వర్ధిల్లఁగఁజేసి బాగుపడుచే నీతెల్వి మల్లేశ్వరా 17

మ. నమకమ్మున్ జమకమ్ము సూక్తములు నీనామమ్ములు న్నీదు పెం
డ్లము నామమ్ములు వానికి న్నొడువు మే"లా"ఋక్కులున్ వానిచే
నెమ కంజేయకు కోర్టులన్ మఱఁగుచో నీకొంప మున్గుఁజుమీ
నిముసంబేనియు వాని నేమఱమియే నీబాగు మల్లేశ్వరా 18

మ. పదిగంటల్ గద? కోర్టులై మదియు నీ పాదార్చనాసక్రియన్
గుదురం బోవుటయెట్లు? వండి, యది నీకుం జూపి, తా మెక్కి త
న్నెదురుం జూచెడి పారటీలగమితో నేనాఁటి కానాఁడె త
ప్పదు కోర్టేగుట, యర్చకత్వమెటులో వాకుచ్చు మల్లేశ్వరా॥ 19

శా. వేతాండూర నివాసమయ్యెడ నెటో వేళే చెసేయున్మ, పైఁ
దీరంగావలెఁ గాల్యముల్ పయిబయల్ దేరన్ వలెన్ రావలెన్
సారాంశమ్ములు పారటీలకెఱుకన్ సల్పన్ వలెన్ స్నానమీ
పై రాజన్ వలెఁ బొయ్యి కోర్టిచటికిన్ బల్ దవ్వు మల్లేశ్వరా॥ 20

శా. ఏతంబెక్కినవాని ఫక్కి గద? యాయీ నీదుపూజాభరం
బీతంటాలును సంధ్యలోనయిన సత్కృత్యమ్ములున్ వంటయుం
బ్రీతిన్నీదు సమర్చనమ్ము నెటు ప్రాప్తించున్ మనుష్యుండె తా
దోతంత్రీ? యని దేవుఁడే నెటులు సేయుం దెల్పు మల్లేశ్వరా॥ 21

మ. అనృతమ్ముల్ మును సంత చెప్పినవి తానానాఁడు రువ్విచ్చి సా
క్షిని నిర్భీకు నొనర్పఁగావలయుఁ బైఁ "గేసెట్టులన్ గెల్తు మం
చును బార్టీను సికొల్పఁగావలయుఁ బై సొమ్మెంతయో కొంత క
ర్చున కంచున్ గొనఁగావలెన్ జనవలెన్ జూ? కోర్టు మల్లేశ్వరా॥ 22

శా. ఎన్నో సృష్టులు సేయఁగావలయు నెన్నేఁ గల్పనల్ సత్యమే"
యన్నట్టుల్ లగియింపఁ గావలయు నీయాయాసపుం గోలలో
నిన్నున్ నన్నును జూచువారెవరు? మన్నింపన్ భజింపన్ యజిం
పన్నైవేద్యమొసంగ వీలెటు ఘటింప న్వచ్చు మల్లేశ్వరా॥ 23

మ. అనృతంబాడని గొల్లజోయలకసత్య ప్రీతిగల్పించి వి
ప్రుని యీనాముకుఁ గొక్కువెట్టు సుళువుల్ బోధించి యాఘామిలో
దనకున్ భాగము నేర్పరించికొని యీతం డిప్డు వర్తించు ప
ర్తనకు న్నీదగు నర్చనక్రియకు నే తంపెట్టు మల్లేశ్వరా॥ 24

మ. తనపూర్వుల్ నినుఁ బూజసేసిరికదా? తచ్ఛుద్ధచారిత్రముల్
కనివిన్నట్టిఁడె యీతఁడిప్డిటులు నిన్ గాటించు చున్నాఁడె టో

ధనమార్జించునకాని యుక్తముగఁబద్ధ్రిష్యమ్ము వెచ్చింపమిన్
మనుకాలమ్మునఁదాఁపు నీవయిన యమ్మాన్యమ్ము మల్లేశ్వరా॥ 25

మ. కొడుకున్ దానును రెండుపొట్ట, లిఁకఁదక్కం గల్గువారెవ్వరున్
గుడువన్ గూటికిలేరుగేహమున, నీకుం జెట్టిత్రాసెంత ని
ల్కడగాప ర్తిలవచ్చు? నప్పులవృథాగా జెంచఁగానేల నీ
మడిమాన్యమ్ములమీద నీతనికిస్వామ్యమ్మున్నె మల్లేశ్వరా॥ 26

శా. పందల్ పూర్వపులెక్క, నేఁడనిన వేల్వాప్పున్ జుమీ? భూమిపైఁ
జందాలున్నవికొన్ని, నీవెఱుఁగవే? శశ్వత్సమారాధనల్
నందాదీపములేమి కేకతము? మానాఁడిట్లు పాతమ్మె నీ
చందమ్మియ్యది మాకులోపమెయగున్ సర్వమ్ము మల్లేశ్వరా 27

శా. మాలోపమ్మునుకోక శక్తికొలఁదిం బత్మారుయత్నించి మే
పీలుంగానకమిన్నకుంటి, మతఁడు ద్వేలుండు గ్రామమ్ములో
మాలోమాకనుకూలభావమది సామాన్యంబు, నీవింతయుఙా
నీలోఁజాలనెఱింగి సైఁపగదె మానేరమ్ము మల్లేశ్వరా॥ 28

శా. దేవస్థానపు రూలుసున్నదఁటయోదేవా? తదాధారపున్
జేవన్నీవగునర్చకుండు వినయశ్రీదాల్చునేమో? మహీ
దేవుల్లోనగు గ్రామపుంబ్రజలునీ తిండిన్విచారింపరే
జావోపాపము? మెక్కుచుంటివదియున్ స్వల్పంబుమల్లేశ్వరా॥ 29

మ. పరమేశాన్ని యిహమ్మెకొన్నియుభయప్రాప్తిన్ బ్రసాదించునే
చరణారాధన మట్టిదీనికొఱకే జన్మించు ప్రాణిక్ మహా
త్తర సౌభాగ్యనిధుల్ గదా? సుఖముగాఁద్వత్సేవకాపించి స్వ
ర్గరమన్ బొందక యర్చకుల్ చెడుట ఘోరంబయ్యె? మల్లేశ్వరా॥ 30

మ. ఒకపోనేగఁబనేమి? యర్చకునకేయూరేమి యైనన్ భవ
త్ప్రకటాంఘ్రిద్వయపూజకున్ వలయు తత్తత్పత్రిపుష్పాది వ
స్తుకదంబమ్మును నేకరించు కొనుచుఙా శుద్ధాత్ముఁడై నిన్నుఁ బా
యక పర్తింపట భుక్తిముక్తు లిడుఁగాదా? తండ్రి! మల్లేశ్వరా॥ 31

మ. తన యంతన్నినుఁ గొల్వకున్న నితరుల్ తన్నుందురం చేనినిన్
దినమున్ గొల్చెడి యర్చకాన్వయమునందే పుట్టి పెంపొంద గాం
చిన ప్రాణిన్ సుకృతాత్ముఁగాఁ దలఁచు మత్సిద్ధాంతముంగూడ నో
యనఘా నీదగు నర్చకుండు మనసీఁడయ్యయ్యో మల్లేశ్వరా॥ 32

మ. ప్రతిబంధమ్మనసేని నీదగు సమర్చన్నిత్యమున్ సల్పువాఁ
డతిధన్యాత్ముఁడటన్న నానుడికి దేవా? వ్యాసముఖ్యుల్ మహా
యతులాధారము దేవదేవుసెటులే నర్చించుచే పుణ్యసం
గతి యట్లబ్బియుఁ జేయకుండుటది దుఃఖప్రాప్తి మల్లేశ్వరా॥ 33

మ. "ధనముంగొంచుఁ బరార్థమర్చనము నింద్య"మ్మంచు శాస్త్రమ్ము లా
డును గాకందులకొప్పరా దొరులనెట్లో పొట్టకై కొల్చు పె
వ్వానికోతక్కినఁ దప్పరాదుకద? యప్పాటున్ భవత్సేవయం
దొనరింపంగ వాఁడు ధన్యుఁడననొప్పో? తప్పో? మల్లేశ్వరా॥ 34

మ. క్షమసేవృత్తియుఁ జేయనెవ్వనికి సంసారంబు దుస్సాధమా
శ్రీమ మన్యత్రపొనర్చకున్న భవదర్చన్ సల్పఁ జేకూరఁ దీ
ర్థముస్వార్థమ్మనుగూడి వచ్చుటగదా? తద్భాగ్యమబ్బంగన
క్రిమమార్గమ్ములు ద్రొక్కుటెంతయును దౌర్మార్గ్యంబు మల్లేశ్వరా॥

మ. ఫలముల్ లోనగు సర్వవస్తువులు దేవప్రీతికై యుత్తమం
బుబుగాఁ గైకొని యాత్మసన్నిధికి భూపుల్ బిలుం[illegible]
గ్గలపున్ భక్తిని దెచ్చి యిచ్చెదరు భాగ్యంబింతకన్నన్ మను
ష్యులలో నెవ్వనికున్న? దర్చకుఁడు ధన్యుండోయి మల్లేశ్వరా॥ 36

మ. ధరవాణిజ్యము లాభకారియనుచున్ దజ్ఞుల్ ప్రశంసింతురం
దరయన్నిత్యము సత్యహాని ప్రతివాక్యమ్మందుఁ గన్పట్టుటన్
బరమేకాక యిహమ్ముఁ గూడఁ జెడుదేవా? నీదు పాదార్చనా
భరమే యుక్తమొ? వర్తకంబె వరమో? వాక్రుచ్చు మల్లేశ్వరా॥ 37

మ. హలవృత్తిన్ గయికొందమన్నను బశుప్రాయుల్ పశుల్ సేప్యతా
స్థలముల్ గాఁ దగుటబ్బు విప్రులకుఁ దద్వ్యాపారమాపత్సమా

కలనీయమ్మని చెప్పఁడే మనువు త్వత్కైంకర్యముం బోలనీ
యిలలో నొండొకవృత్తి యెయ్యెడల లేనేలేదు మల్లేశ్వరా. 38

మ. నృపసేవాపరులొందు కష్టములు వేఱే చెప్పఁగానేల? ఐల్
త్రిపవుట్టున్ స్మరియించుమాత్ర; "నసిధారావ్రతా" మ్మంచుమున్
వ్యపదేశింపరె? పండితుల్, సుఖము త్వత్పాదార్చకత్వంబె? యే
యపకారమ్మునులేదు దీనఁ, జరమో? ప్రాప్తించు మల్లేశ్వరా॥ 39

మ. ఇఁక భిక్షాటనవృత్తి; దోషమొకఁడే నీ వృత్తిలో లేద పొ
ట్టకునష్టప్పటి కంతొ యింతొ సమకూడన్‌గల్గు నిద్దాన; ని
ల్వకు సంపాదన గావుటబ్బదిదియున్ భావత్కపాద ద్వయా
ర్చకు వృత్తిన్ గడవంగ నేర దతినిస్స్వంబౌట మల్లేశ్వరా॥ 40

మ. కలవింకన్ బలువృత్తులెయ్యవియు నీ కైంకర్యముం బోల వీ
ఫలవంతమ్మగు వృత్తి పాల్పడియుఁ బాపవ్యాపృతింబోవు ని
ష్ఫలులం జూచి విచారమందవలెనో? సంతోషముం బొందఁగా
వలెనో? యిందెది యుక్తమో? నుడువుమప్పా? మాకు మల్లేశ్వరా॥

మ. సుకృతమ్మున్ దురితమ్మునప్పొడి మనుష్యున్ జూచి యామోదమున్
బ్రకటింపన్ బ్రకటించువాని కపటన్ భాగమ్ము చేకూఱు, న
ర్చకు నుత్సేకము మాకటుండ నది దుస్స్వాపమ్ము నీకేని, యం
దుకు నామోదములేమి తెల్పుటకె యీ దుఃఖమ్ము మల్లేశ్వరా॥ 42

శా. గ్రామార్థమ్మయికాదె! నీకిట గుడిన్ గట్టించినారుప్పుడ్వలో
స్వామీ? పేరినిమిత్తమర్చకుఁడు నేర్పాటయ్యెఁదల్లోపమీ
గ్రామమ్మున్ ఘటియించుఁ, గావున నుపేక్షన్ జూపఁగారాద నీ
కో? మా యూరననేల? గుళ్లె కఱవా? కోట్లుండు మల్లేశ్వరా॥ 43

శా. మా కోసమ్మట నీవు కట్టువడి గ్రామస్థుల్ విచారింపమిన్
"నాకశ్లోక" పు టర్థమున్ గుడుచుచుఃఁ గష్టించుచున్నావు నీ
కో? కాశీముఖదివ్యతీర్థములు పెక్కుల్ మాకు నీవేఁచో
నీ కుగ్రామనివాసమో? ధరము గాదే దేవ మల్లేశ్వరా॥ 44

శా. నీ కప్పుల్ గదుఁ బ్రీతిపాత్రములగు న్నీయర్చకుం డెట్టులో
నీ కవ్వానిని గట్టి పెట్టెఁగద ? వీనిం బట్టి యేనిన్ సదా
యీ కుగ్రామ నివాసమర్హమగునీ కిందెందు కేనుండినన్
మా కామాత్రమచాలు నయ్యదియ కామ్యంబయ్య మల్లేశ్వరా॥ 45

మ. సకలంకుండగు చంద్రు నంకమును నిష్కాసించి తల్లేఖహే
లకునై శీర్షమునన్ ధరించెడి భవల్లాలిత్య మీ నీదున
ర్చకుఁ డెట్లో లలితుం బొనర్చి తగునర్చల్ పొందఁగాలేదె ? దు
శ్చకమే ? నీ, కిటులెందుకో గద ! యుపేక్షాబుద్ధి మల్లేశ్వరా 46

శా. కాలన్ బోయెడి దాని నెత్తి నిడుకోఁ గానేల ? యద్దానిచేఁ
జాలంబోలుకులానరు న్నలు పనల్పం బూన్పఁగానేల ? యీ
గోలం జిక్కి పవిత్రులన్ జెఱుప దుష్కోపానమ శ్శీల పుం
జాలై బాగఱనేల ? నీవెఱుఁగుచో వాక్రుచ్చు మల్లేశ్వరా 47

మ. కలికాల మ్మిది దేవతా మహిమమే కాదన్య మేకాదుదు
ర్బల మిప్పట్టున నట్టిచో స్వకుల మర్యాదల్ చ్యుతిం దాల్చుచు
ర్మలినత్వప్రతిపాదకమ్ములగు కర్జమ్ముల్ వృథాఽహంకృతిన్
బలవంతమ్ముగ సల్పి నిన్నచటఁ గల్పన్ మేలె ? మల్లేశ్వరా॥ 48

మ. కుల భేదమ్ములు లేని నీకుఁ గుల సంకోచమ్ము బ్రహ్మర్షి స
ద్వ్యాలె కల్పించిరి సమ్మతించితివి దుర్దోషమ్ము ...వే
లలి నంగీకృతమయ్యె ? నీవా కయొడన్ లక్షింపకున్నన్ విధి
జ్ఞులు విద్వాంసులు నిన్ను నొప్పెదరె పూజ్యుండంచు మల్లేశ్వరా॥ 49

శా. కౌళాచార పురస్సరమ్ముగను సంస్కారుల్ నినున్ నిల్పిరే
నీ లోపమ్మది కొంత సహ్యమగుఁ గానీ యట్లు నీయున్కి సం
బాళింపంబడ దాగమోక్త విధి నీప్రాణ ప్రతిష్ఠాది కం
బోలింగాలుట మాకు నీకు నొకచే యోగమ్ము మల్లేశ్వరా 50

శా. సారా బాదులు సేస్తురెట్లొ అటులేనర్వమ్ము నీవెందునా
చారమ్మున్ గంబుకోఁదగున్ మిగుల విస్తారమ్ముతో నేమి ? సం

సారం బేగతి విప్రుఁడీఁడునా పవిత్రత్వమ్మైన నేమమ్ముతో
నారీతిన్ గయికోని నీకు నగుఁ బ్రాయశ్చిత్తి మల్లేశ్వరా॥ 51

మ. అదె సంప్రోక్షణ మంత్రము ల్పెద్ద లిపు డయ్యాచారమున్ సల్పు త
ప్పైనను నీదగు సర్వకుండు నిసుఁగుదెప్పన్ దానికై నీకు న
మ్మదమో? కాదో? యొకింత తెల్పుఁడగు నమ్మాలిన్యమున్ స్నైఁతు వే
నెదియు న్నీయెనశక్తి లేమి విచితంబేయౌను మల్లేశ్వరా॥ 52

మ. ఎదియుం దెల్పక మిన్నకున్నయెడ నీవీ యర్చనన్ రోసి యీ
పదమున్ వీడి మఱొక్కచోటి కిబమున్ బ్రస్థానమున్ జేసిన
న్నెద నూహించెద మట్టులీ పరుగు మాకేనిక్కమే యైననీ
కెమనై నీఋణదాత లద్దికొని పోపేరయ్య? మల్లేశ్వరా 53

శా. మాలిన్యమ్మున కొప్పఁజాలని యెడన్ మాజోలికిన్ రాక నీ
పే రాత్మత్వ మహత్త్వ మర్చకున కోలిన్ దెల్పి శుద్ధాత్ముఁగాఁ
జాలింపన్ బ్రియతింపు మూరక యెటో పాఱంగనుం కింపనిన్
జాలన్ రోయుదు రుత్తమజ్ఞులు దెసల్ చాటించిమల్లేశ్వరా 54

మ. భవదీ యార్చకునంత నొండొకఁడు పాప వ్యాపృతుండుండిదు
ర్వ్యవసాయమ్మునకున్ గడంగు కతనన్ గ్రామస్థితుల్ సేయు న
ద్వ్యవసాయమ్ము ఫలింపకున్నయది యైక్యా భావమే దేవ నీ?
యుపయోగమ్మునకున్నిమిత్త మిదినీపాలింపు మల్లేశ్వరా 55

శా. ఈ దుష్టాత్మునకున్ గురుండనినఁ గానీ దేవుఁడంచన్నఁగా
సీ దోషంబని కాని యన్యమని కానీలేదు దుష్పౌరుషం
బేదో లోఁగొని గ్రామమున్ జెఱుపఁ దానెల్లప్పుడున్ దుష్కృతుల్
సేవన్నన్ వినకే యొనర్పఁ గడఁగున్ గష్టించి మల్లేశ్వరా 56

మ. గత మందిచ్చిన భూమి దానమునకున్ గల్పించు నభ్యంతర
స్థితి గ్రామమ్మున నున్న పంతులపయిన్ ద్వేషించుఁబైశున్యమున్
వెతగాఁ గైకొని దుర్మ్యులన్ బుధులపై ద్వేషింపఁగాఁ జేయుచు
ర్మతి యివ్వాఁడె త్వదర్చకున్ జెఱిచెఁ జేరన్ దీసి మల్లేశ్వరా 57

శా. గ్రామమ్మంపలి మాల మాదిగలునున్ గష్టాత్ముఁ దీతం డటం
చేమేనిన్ పనుఁ జెప్పకోఁదగిన దుష్కృత్యమ్ములన్ నిత్యముఁ
ధీమందుం దలవాఁడొనర్చు గురువున్ దేవుండు తేఁడల్లను
శ్రీమూర్ఖుప్యన కీతఁ జేయఁడఁచె నీశ్రోత్రియమ్ము మల్లేశ్వరా 5

మ. ఉపకారుల్ నృపుతోడఁ జెప్పియొ మతెట్లో నీకు దీపాదికం
బుపపన్నం బొనరింప నెంచునెడ నీయోగ్యేతరుం డెట్టులో
యపసాక్ష్యమ్మున కాత్మభృత్య సహితుండై సిద్ధ మౌనంచు గ్రా
మపుఁ బెద్దల్ వెస దీయుచుండి రెటులో మన్నింపుమల్లేశ్వరా 5

మ. కుల విప్రుండనె నొజ్జకన్యలెవరో గోదాన మీయంగనీ
చలచిత్తుండల భూమి లాగి కొను నిచ్చల్ పుట్టఁగాఁ జేసెధీ
మలినుం డిట్టిడు నీమనచ్చికున కుండట్టొటచే నూరిపె
ట్టుబ నీదుర్గతిఁ బాపలేరయిరి తథ్యంబింత మల్లేశ్వరా 60

మ. హలవృత్తి గ్రహణంబె విప్రులకుఁ దానాపత్తునఁ ధర్మమై
వెలయఁ దానిన కాక యిచ్చెనఁటి నిర్భీడాత్ముఁడైవాతిగు
ట్టలు కూలింగొని తోలఁగా దొడఁగెఁ గట్టా ? నీదు వాహమ్ములం
గలయంగట్టిన బండితో నెఱుఁగుదేశా ? నీవు మల్లేశ్వరా 61

మ. కుల మర్యాద నడంచు పాపమునకున్ గోపమ్ముమైఁబోయి బాం
కులు నోరాజిఁగఁ గూసి వంశ నుడు నేపల్ పల్కమై నెన్ని యో
కలుషమ్మున్ పొనరించు కారణమ నంగాకున్న నివ్వానికిన్
వెలమోమై కళతప్ప నేమిటికయో ? విశ్వేశ ? మల్లేశ్వరా 62

శా. వేదద్వేషము విప్రవైరము దయావిద్వేషమున్ నిత్యదు
ర్వాద ప్రీతి దురుద్యమాదృతియు దుష్ప్రారంభ సంసక్తి దు
ర్ధీ దౌర్జన్యములోను గాఁగలుగు నిర్భీడుండు నీలెంకకున్
దా దైవమ్మయి నీకుఁ దెచ్చెనయయో దైన్యమ్ము మల్లేశ్వరా 63

శా. వాఁడున్ వీడును నిన్నరేకపడుటన్ వాయ్వగ్ని సంయోగమై
మూడెన్ ముప్పుత్వదాలయమ్మునకు, నిమ్మూర్ఖాగ్రణుల్ నిత్యమున్

గూఢవన్ గోష్ఠులయందె మ్రొగ్గెదవు నీకున్ వంత పూటించునే
కూడీపై ఘటియించు నేమొ యని నాకుండోఁచు మల్లేశ్వరా॥ 64

మ. గురువున్ దైవము లేని యంత హతభాగ్యుండెవ్వఁడో యింకనో
నరకంపుం డెయువంటి పోఁవగిన యున్మత్తుండు నీ వెంకనున్
బరమాప్తుం డలవాని పిమ్మటను నీ పాదార్చకత్వంబొగిన్
జనులున్ స్త్రీ కెఱుఁగంగఁ జెప్పితిని దే సత్యమ్ము మల్లేశ్వరా॥ 65

మ. అలవాఁ డెప్పుడు పోయి నాకొదవుని యార్తిన్ దొలంగించునో?
యెలమిన్ జెప్పుమటంచు వేని వినుమో యాశాన? సర్వజ్ఞతా
కలనంబుండియు నన్నుఁగోరితివిగా? క్షాణిమ్ము పాపమ్ములన్
సలుపంనినబూదేదె కుండునె? భవిష్యత్స్రష్ట మల్లేశ్వరా॥ 66

మ. ఎవఁడున్ దానొనరించు కర్మములచే నే పొందుటల్ సృష్టిటల్
ధృవమేనిన్ మనశంతనేయు పనులెందున్ మంటపల్ నేయు స
ట్టివిగా నున్నవి వీనినెల్లరును దిట్లేతిట్టుచున్నారు స
ర్వ విధాలన్ జెడుకాలమే వరికొగెన్ రాఁబోలు మల్లేశ్వరా॥ 67

శా. పాపిన్ జూడని వర్తనంబు కులవిప్రద్వేషమున్ దేశకున్
భూవంద్యున్ చరితమ్ములాడుటయు మర్యాదల్ దురాచారులన్
సావాసమ్మునఁ జేరఁదీయుట మొదల్ చండాల మిర్వృత్తియున్
దేవా? నీకుపకారమున్ సలుపనున్నే? తెల్పు మల్లేశ్వరా॥ 68

మ. కులవిద్యల్ నశియించుచున్నవని పాత్రజ్ఞుల్ వానికై నేయు స
ల్లలితంపుం గృషి నడ్డుపెట్టుటకు నిర్లజ్జుండు మ్లేచ్ఛుఁడై
"కలికాల"మ్మని యెల్లరుం దెగడ దుష్కర్మమ్మొకం డూనె ని
ప్పలుగాకెన్ జెడఁదీయు నిప్పని మొనర్పం డౌచు మల్లేశ్వరా॥ 69

శా. నీయాంతర్యమెఱుంగునో! యెఱుఁగదో! నీవెంక మాశంకయున్
మాయావ్యాప్తస్మృతిఁ దప్పు "కేసు" నొకఁడున్ మామీఁద సృష్టించిర
త్యాయాసమ్మున సత్యమి ద్దధిక్కృతి వ్యాపారికిం దెల్పు నీ
పీయుద్రిక్తులఁ గూలఁద్రోయవె మదమ్మేదంగ మల్లేశ్వరా 70

మ. అటుకావింపవయేని యీచెనఁటు లన్యాయంపు దుష్కల్పనల్
ఘటనానై పుణి నెట్టులో పొలిపి యేకర్రాసకున్ బోక దూ
రటకుల్ గాక మెలంగు గేస్తులను మేరన్ మీఱి బాధింతు రె
వ్వటికిన్; దేవరచిత్తమాపయి విధింపన్ జాల మల్లేశ్వరా॥

శా. దొంగల్ బాధకులో గృహస్థతతికిన్ దుష్కల్పనానల్ప వా
గ్భంగున్ బాధకులో గణించినయెడన్ స్పష్టమ్మగున్, మేక వ
న్నెంగన్పట్టు పులున్ కుకల్పకులు వీనేర్పెల్ల వీదోహులన్
గుర్రంగం జేసెడి పట్లనే నెఱపి మొర్రిక్కున్ గొన్ము మల్లేశ్వరా॥

శా. పూజార్హున్ వృథగా సురున్ దెగడి తాఁబూజారి నర్చించుటన్
తేజశ్శూన్యశకాక యేమగునొ? మాదేబన్న గుర్తింపఁబోఁ
డీజాడ్యమ్మది వెంటనేయెదిరె నిందేమౌనొ? మాజాల్మొటు
ర్స్త్రీజాత్యాన్యత కానవీయదయయో? శ్రీకంఠ మల్లేశ్వరా॥

మ. పగటన్ దల్లియు రాత్రి భార్యయుగ నిప్పాపుండు వర్తించుదు
ర్భగుఁ డివ్వానికి భార్యయేమి కతమో? ప్రాప్తించె సచ్ఛీల యా
సుగుణంపుం గని కార్తి గల్గుననినీచున్ వీని శిక్షింపఁగాఁ
దెగఁ డక్కాలుడు గూడ సత్యమిదివో దేవేశ మల్లేశ్వరా 74

శా. భార్యాయోగ్యత గల్గియుఁ జెడిన దుష్ప్రారంభులన్ ముష్టదుం
శ్చర్యా ధుర్యుల నెండఱఁ గనము దోస్సారమ్మ మైఁబాపపుం
గార్యమ్మున్ పొనరింప భార్య చెటులాఁ గన్నెర్తు రుదిర్క్తదు
ర్మర్యాదాకలసంబులేరినయినన్ మర్గిందించు మల్లేశ్వరా 75

శా. కాళ్ళు యిద్దెనలుఁ దినన్ మరిగి యీకష్ట ప్రచారుండు దు
ర్లాపుండెట్టులో పిల్లినెల్కపయినెల్కన్ బిల్లిపైఁబెట్టి తా
నేపాట్లో పడుచుండు వీని కుదరంబేసర్వమున్ ధార్మికుల్
శాపాస్త్రుల్ గని వీనిపైఁప దెవరో శాసింతురి మల్లేశ్వరా॥ 76

శా. నేనే సత్కవినేని వాఁడు ఖలుఁడేనిఁ నేను దత్తేమసం
ధానం బెంతునయేని వాఁడు ననుఁ దద్దన్ జిక్కులం బెట్టఁగా

లో నూహించునయేని నీ వఖిల మాలోకింతువేనిన్ దివ
జ్ఞాన మ్మెల్లను బట్టబైటఁబడు నిక్క మ్మింత మల్లేశ్వరా॥ 77

శా. దేవాగారవుమేలు గోరి మది యత్నింతున్ ద్విజన్మాగ్ర్యవి
ద్యావిఖ్యాతికినై యతింతు నుభయ మ్మవ్వాఁడు ద్వేషించు నీ
ద్వైవిధ్యమ్మున నేరికిన్ జయము సంప్రాప్తించునో? మాత మో
దేవా? ధర్మమెతా జయించునని నెందేఁ గాని మల్లేశ్వరా॥ 78

మ. గురులన్ హేళనసేఁత సత్కృతుల కెగ్గుల్ వన్ను నారోఁత త
స్కరులన్ లాలనసేఁత పిట్ట కతిరిక్తం బైన పెన్మోఁత యీ
కొఱకున్ మాలినపేరికకున్ సహజ మై ఘూర్ణిల్లు నీ శుంఠ దే
వరయుష్మద్గతి కంతరాయ మిది సంభాళింపు మల్లేశ్వరా॥ 79

మ. ఎఱతోలున్ మిడిగ్రుడ్లు వెల్లమొగ మై యే తెల్వియున్ లేక న
ల్వురలోనన్ నగుఁబాటుగా మెలఁగుచున్ లోనైన శంకింపకే
పరిహాసమ్మున కేని బాల్పడు పశుప్రాయుండు నీ లెంకకున్
బరమాప్తుండఁట? యేమి లోప మిఁక నప్పా? నీకు మల్లేశ్వరా॥ 80

శా. నీకున్ మిత్రుఁడు గుహ్యకేశుఁడు గదా? నీలెంకకున్ దత్పద
ప్రాకట్యమ్మున కర్హుఁ డైన యతఁడే ప్రాప్తించె మిత్రుండు మీ
యేకత్వ మ్మిటువంటి దౌ కతన నీ కిష్టుండె నీ లెంక; వాఁ
డేకాలుష్యము వెట్టినన్ సయిచె దీ విట్లౌట మల్లేశ్వరా॥ 81

శా. నా యత్నంబు త్వదర్థ మిక్కృతికి విఘ్న మ్మెట్టులో కూర్పని
మ్మాయావుల్ ప్రియతింతురి చోరజనులన్ మన్నింతు రెంతేని నీ
శ్రేయం బే గతి నిల్చునో? యెఱుగనీ చిత్తమ్ము దుర్జ్ఞేయ మా
మ్నాయధ్యేయ? యుపేక్ష కూడదు సుమీ నాపట్ల మల్లేశ్వరా॥ 82

శా. దొంగల్ వంచకులున్ బృథగ్విధగతిన్ ద్రోహమ్ము నూహింప చో
భంగమ్మంతగ నుండ దొంగదొరలు ప్రాపై ద్రోహముల్ సేయుచో
భంగ మ్మెట్టిదొ నీ వెఱుంగవె? పృథాపాల్మాలుటల్ కూడునే?
హెంగాయింపఁగదవయ్యా? వీఁడ్రదురహమ్ముం ద్రుంచి మల్లేశ్వరా॥ 83

మ. కుజనున్ బొంగడఁ గించునట్టిపని నీకున్ గష్ట మేపాటి య
య్యా ? జడత్వమ్మున వాఁడు దర్పివికొను గర్తానీక మం దౌర్కటన్
వృజినాత్మున్ వెసబూడ్చిపెట్టుపనియున్ వ్రేఁగౌకొ నీమాంద్యమా
ర్యజనుల్ మెచ్చరు నిద్రమేల్కొనుము శీఘ్రమ్మింక మల్లేశ్వరా॥ 84

మ. ఒకచోఁ జిక్కియె యుండె నింక నొకచో నున్నాఁడు చిక్కంగ నే
వికలాత్ముం డధికారిచేత నిజమున్ వీక్షింపఁగా జేయు మీ
చకితుఁడంతటఁ గొంత చక్కఁబడు నీ చండాలుఁ బ్రేరేచుపా
తకునున్మత్తత నే నడంతు నటుమీఁదన్ దేవ మల్లేశ్వరా॥ 85

శా. నీ వంతీ మరితాత్ముఁ డా హతకుఁడో నీ భార్య యార్యామహా
దేవీభాగము, దున్నరక్కసున కాదృప్తుండు దీటౌను నా
కై విశ్వేశ్వరి వానిగోత నిడు నే నాయమ్మహార్యక్షమం
చీ వే చక్క నెఱుంగు దింకఁ గొద వేమీ ? తండ్రి మల్లేశ్వరా॥ 86

మ. అధికారస్థులయందు నెంచ భవదీయాంశమ్ము వర్తిల్లు స
త్ప్రథదూరుల్ పొనరించుకల్పన లసత్యం బెల్ల నల్లంతఁ ద
ద్వ్యథసన్మానసదర్పణమ్ములమెడన్ దోఁచున్ ధ్రువం బన్న య
వ్వ్యథ మిప్పట్టునఁ దెల్పఁగావలయు నో విశ్వేశ మల్లేశ్వరా॥ 87

శా॥ నీ యున్కిన్ మఱి పాఠశాలయునికి న్నీ లెంక మాకుంకయున్
రోయంబూనుట తెల్లమయ్యె నయయో ? రుద్రుండవై దుర్మద
స్వాయద్దుష్కృతుల న్నివారణ మొనర్పన్ గొంకుచున్నాఁడ వి
ట్లైయైనన్ గృహమేధివర్గమున కేదీ ? దారి మల్లేశ్వరా॥ 88

మ. జముఁ డున్నాఁ డని యీ నృశంసకులు లేశమ్మైనియున్ గొంక ర
క్రిమమార్గమ్ములు పెల్లు ద్రొక్కెదరు సిగ్గా ? లేమ నిష్ఠీవముల్
తమ మోరన్ బడిమందియున్ గురియ ఖేదం బన్నదా ? లేద యీ
కుమతుల్ పుట్టినపుట్టు వెట్టిదియొ ? కన్గోవయ్య మల్లేశ్వరా॥ 89

మ. కొమరున్ రోగవిముక్తుఁ జేయుమని మ్రొక్కుల్ మ్రొక్కితిన్నీదుపెం
డ్లము కామేశ్వరి కా జగజ్జననియున్ నాకోర్కి పూరించె గా

మహమహారోగము వాపు మం చిపుడు నిం బ్రార్థించెద స్నేహ చి
త్తము నాభాగ్యము పిమ్మటన్ వగచు మాంద్య మ్మిందు మల్లేశ్వరా.

మ. కలరా గాని మశూచి గాని మఱి రోగా లేవియేఁ గాని యీ
ఫలిచిత్తుల్ బలె గ్రామమున్ జెఱుప నీ కర్తృత్వహాకస్వయిన్
బలిమాటింపఁగదయ్య ? గేస్తులకు నాపత్కారుడ వె తుంటరుల్
నిలు వెల్లన్ విషపుంజముల్ నెఱపుమి ? నీ చూపు మల్లేశ్వరా॥ 91

శా. గ్రామక్షేమముఁ గోరి తేని ఖలులన్ గావింపుమీ శిక్ష నీ
కేమాత్రిమ్మను దాన రక్తి యది లేనేలేనిచో లేశమున్
మా మొఱల్ పనిసేయ వట్లని మిటో మాంద్యమ్ము మే మూనరా
దేమో నీ దయ గ్రామరక్షణము నీదే తండ్రి మల్లేశ్వరా॥ 92

మ. ఎపుడు న్నాకుసికొల్పె దేమి కతమో ? యీలాటినీచాత్ములన్
గపటస్వాంతులు వాండ్రు స్వీయ మగతత్కారమ్ములం బట్టి ని
ష్ఫపయిన్ మాఁకెడిపుర్వులట్లు వృథగాఁ బొంగాడి నిష్కారణ
మ్మపకీర్తిన్ ఘటియింత్రు జాతకఫలంబా యిద్ది మల్లేశ్వరా॥ 93

మ. కలహంబే ఘటియింపఁబోకు మది శక్యం బౌనె ? నా కన్న నీ
చులఁతోఁ గూర్పకు మయ్య? మ్రొక్కెదను సంశుద్ధాత్ములౌ వారితోఁ
గలహం బబ్బిన నబ్బుఁ గా కదియుఁ దాఁ గల్పింపఁగా నేర్పు ని
ర్మలకీర్తిన్ నిను వేఁడు టీయొకటి సుమ్మా? దేవ? మల్లేశ్వరా॥ 94

శా. నీచంబో ఘనమో మఱెట్టి దయినన్ నీయూర జన్మించె నీ
కాచమ్మెల్లరు దీని వజ్రిమని లేకర్మానపోలోకు, లీ
పేచీకోరు లసూయకున్ గడఁగుచుం బెంపాఱుటల్ పూర్తిగాఁ
దోఁచెన్ దీనికి మానసంబు మిగులన్ దుఃఖించు మల్లేశ్వరా॥ 95

శా. గవ్వన్ జేయని వాండ్రితోడ నఁట ? వెంకన్నంట ? తానంట? యీ
చివ్వన్ జేసెడి నంట ? పాజ్ఞులకు నీ చెయ్యూక్ రుచిం గొల్పునే?
నవ్వున్ బల్కెడుఁ గాక పిండ్రినెటులో నాపైకి రప్పించి యీ
అవ్వన్ అట్టును గూర్చుదేవరది నేరం బయ్య మల్లేశ్వరా॥ 96

మ. అనిమిత్తమ్ముగ నాపయిన్ దెగి యనేకాన్యాయముల్ సేయునీ
యనయుండున్న సదస్సున న్నిలువ నే నన్నెమ్మి వీఁ డున్నపం
క్తిని బోసేయను దీనిఁ దప్పనెడలన్ దిందున్ శ్వపాకాన్న మీ
జననంబంతకు నిద్దియే ప్రతిన సాక్షాద్రష్ట మల్లేశ్వరా॥ 97

మ. అరియై నా కభివృద్ధిఁ జెందిన నయుం డన్నన్ ఘవిన్ సున్న తెం
పరి వీఁడెట్టులొ మదిరిపుత్వమును సంపాదించుకొన్నాఁడు తుం
టరి తానై కొఱవిన్ దనంత శిరమబంటన్ గోఁకికొన్నట్టు లి
మ్మెఱకామూలము నుక్కి నా కపశయమ్మున్ దెచ్చు మల్లేశ్వరా. 98

శా. ఏవాఁ డుండెడి గ్రామ మం దునికియే యేనమ్ముగాఁ దోఁచునో?
ఆవాఁడుండెడి వీసెఁ గాక మఱినా కావైపునందే గృహం
బీ వేళ్వాపెటు చేసితో యెఱుఁగరా దీ కీలకం బిందు కో
దేవా? కారణ ముండితీరవలె నేదే నొండు మల్లేశ్వరా॥ 99

శా. ఏ నెంతో వెనుదీయుచున్న కొలఁదిన్ దృష్టుండు వీఁ డేటికో
తా నాపై వెసఁ గాలు ద్రిప్పెడు వృథాదర్పానఁ; గాలం బిటుల్
పోవన్ ముందుకు ద్రొబ్బుచున్నదియొ యీవృత్తాంతతత్త్వమ్ము నీ
వె నేఁడెల్లజగానకున్ దెలుపు మోయీ తండ్రి మల్లేశ్వరా॥ 100

శా. దేవాగారపు బాగు రోసి గురువిద్వేషమ్ము రెట్టించి గో
దావర్యంబువులం దుఁ గోటిఫలిలోఁ దానమ్మనం బోవు పా
పావిష్కృతికి మూలకంద మయి వీఁడత్యల్పకాలమ్ములోఁ
దావున్ బొందునొ? లేక యేమియగునో? చర్చింపు మల్లేశ్వరా॥ 101

శా. గోచీపాత యపంచుఁ బే రిడి గురున్ సూర్యోక్తులన్ బ్రేలు నీ
నీచాత్మం డతిశీఘ్రకాలముననే నేలం బడున్ గానిచో
గోచీపాతకుఁ గూడ దిక్కఱి కడున్ గో డందు వాచాంతల్
[illegible]చించున్ జుమి భావికాలపుగతిన్ శోధించి మల్లేశ్వరా॥ 102

మ. అపవాదల్ గురుపై వృథా గిలికి ము న్నాలోకమున్ జేరె నీ
విపరోక్షమ్మునఁ గాక యెట్టియెపటన్ దృష్టుం డొకం డిం తెటిం

గి పశుప్రాయత నేమియుఁ దెలియలేకే వాని యుద్యోగ మీ
చపలుం డూని చరించు నే మనుజకో చర్చింపు మల్లేశ్వరా॥ 103

శా. పూజారిన్ భజియించుకారణమునన్ బూజారి భావమ్ము తా
నీ జాత్యంబు వహించి పూజ కరి యై యిష్టే గురుద్రోహియై
బేజారై కృశియించి రూపతి చెడున్ విద్యల్ దురంతమ్ములా
యీ జాడన్ ఫలియించె నందు రవ్వ డీపే వింత మల్లేశ్వరా॥ 104

మ. కళకున్ బాసెను విద్దెకున్ జెడియె దుఃఖప్రాప్తికిన్ సిద్ధమై
కులమర్యాద నతిక్రమించెఁ గడు బొంకుల్ అంకులున్ గూసె బం
ధులమోముల్ నగఁజేసెఁ దుర్వ్యయుఁడయి యీ దుష్టుండు వీఁడింక నెం
దుల కుండన్ వలె జీవలోకమున యందున్ దెల్పు మల్లేశ్వరా॥ 105

శా. పశ్చాత్తాప మటన్న మా టెఱుఁగఁ డీ పాపాత్ముఁ డీలాటి యీ
దుశ్చిత్తున్ క్షమియించె దేనియు మహాదోషమ్ము నీ కబ్బుఁ జే
తశ్చండాలతకల్మి పీ డఱచు వాతప్పుల్ గణింపం గదే?
వాశ్చారేద్ధ్యజధగ్గలాటనయన వ్యాపార? మల్లేశ్వరా॥ 106

శా. ఈనిర్భాగ్యుని శిక్షచేసి రని కాదే తల్లి పెండ్లింటిలోఁ
దా నీమధ్యను గోలుగోలు మని సంతప్తాత్మయై యేడ్చెదే
వా? నా నిశ్చయ మాలకింపు మొకచో వంధ్యాత్వమే యిట్టిసం
తానం బబ్బుటకన్నఁ జాల మెఱుఁగౌఁ దథ్యమ్ము మల్లేశ్వరా॥ 107

మ. తెలవారన్ "రవిగుర్తింకునే" యనియును దీపమ్ము డన్ బిమ్మటె
"దెలవారన్ గలదే" యటం చనియు నీదృక్పుంతలన్ గన్న త
ల్లులకుం బెల్లుడిగుల్ గదా? యిదియ మేలో? వంధ్యయైయుంటయే
యిల మేలో? వివరింపు మయ్య? యుభయమ్మెంచి మల్లేశ్వరా. 108

మ. కొమరుం డేదియొ తప్పు సేయనదియున్ గోర్టెక్కి శిక్షింతురం
చమలుల్ సెప్పికొనంగ నయ్యదియుఁదాసైన న్లైటో వార్త రా
త్రిమ ప్రేరేపఁగఁ దల్లి చేద్చె నిది యాపత్సూచకం బౌనొ? ప్ర
ద్ధముగానుండిన శిక్షతప్పుటకై యపర్ధం బౌనొ? మల్లేశ్వరా॥ 109

మ. మొదలన్ దొంగిలెఁ దోఁటకూర యది పోవుల్ వెట్టి వర్ధించెఁ బ
ల్లి దనూజన్మున కంతటన్ గొమరుఁ డోలిన్ దొంగయై వీఁపు వె
మ్మవరన్ దెబ్బల నొందునాఁడు గతవృత్తాంతజ్ఞుఁడై మోఁది కొం
చెదవ్రియ్యంగను నేడ్చె నం టెఱుఁగవే యీగాథ మల్లేశ్వరా॥ 110

శా. తల్లిన్ తండ్రిని దిట్టఁ జేయు కొమరుల్ తా మేల పుట్టన్వలెన్
ఒల్లన్ బెంచినఁ దీరదే? శునకమున్ బ్రేమించినన్ బోవదే?
కల్లల్ కల్పనఁజేసి కోర్టులకడన్ గాపుండ వీ కుక్కలుం
బిల్లల్; కొంపకుముప్పు దేవుగృహ మోర్మిన్ బ్రోచు మల్లేశ్వరా॥ 111

మ. తనపుత్రున్ జిననాఁటనుండియును వృద్ధుం బైన హొట్లాటలన్
ఘనుఁగా దిద్ది యొకంట విప్పు దాక శిక్షన్ బొంద గోర్గ్రోలునన్
జను లేమందురు మున్నెఱుంగదె? యిసీ? సాధ్వుల్ తనూజన్ములన్
మనుపంగావలె నీతికిన్నిలుచు సన్మార్గాన మల్లేశ్వరా॥ 112

శా. ఈ నేమమ్మునఁ గాక యాత్మజుల నెంతేఁ గొట్టకుక్కల్ బలెన్
దా నేయమ్మ యపోహమైఁ బెనుచు నా తల్లిన్ వృథాదుఃఖముల్
పూనన్ జెప్పినయట్టు లెల్లయపుడున్ బోబో దొకష్టేదియో
జూనన్ గంతము నొక్కనేడ్వ విడునొక్కో? కోర్టు మల్లేశ్వరా॥ 113

శా. ఈపై నేని స్వయంకృతాఘమునకై యీ యమ్మ లోఁగుంది యీ
కాఫీ యిద్దైన ప్లీడరీకిఁ గొమరుం గాసీక యున్నంతలో
నే పొట్టో తిని కూయుచుండు మనుచో నీయేడ్పు త న్నంటఁబో
దీ పాడిన్ మనకున్న నే డ్పుడుగఁబో దీ తల్లి మల్లేశ్వరా॥ 114

మ. అదియుం గాక శ్వపాకులున్ దినని యా యన్నమ్ము నీకున్ నుదు
ర్మముఁడై పెట్టిన యర్చకున్ ద్విజులు మారమ్మం దిడన్ వానితో
డ్లిదిగా సర్వము పీఁడు వర్తిలుట నీ డెంద మ్మెఱుంగుఁడా శివా?
మొదలన్ వీని నడంపు మీఁద నొదుగుం బూజారి మల్లేశ్వరా॥ 115

శా. అస్మత్పృష్టదుష్టగ్రహాగ్రహణమం ద త్యంత మాసక్తితో
విస్తృత్తవ్యము గాని తప్పుదు కృతుల్ పీఁ డిట్టు ఖావించుటల్

భస్మంబౌటకో? లేక యేమగుటకో? వాక్రుచ్చు మాదేవ క్రూ
తస్వాంతైకనిధిన్ గురున్ దెగడునే? తజ్జ్ఞుండు మల్లేశ్వరా॥ 116

మ. మనుజన్ జాలు పురోహితున్ దెగడి యా మంత్రాత్మకుం డేటికో
తనకున్ మారకుఁ డౌ పురోహితు నెదన్ దాత్పర్యపర్యాప్తుఁడై
జననింద్యమ్ముగ గాయఁ బూని నల దుశ్చర్యుండు ప్రేరేప వీఁ
డనయమ్మున్ చెడిపోక యేమియగు నప్పా? చెప్పు మల్లేశ్వరా॥ 117

శా. కూడన్ గుద్దయు లేని వంశముననీ క్రూరుండు తాఁ బుట్టె ని
ర్వ్రీడుండమ్మమ కారణమ్మన నెటో రే చింత మా చింతయున్
గూ డేర్పా టయి యంతకున్ ముదిరె నీ కూళన్ యథాపూర్వపుం
గోడున్ గుడ్వనఁ గాని గ్రామము వ్యథా గూర్పెట్టు మల్లేశ్వరా॥ 118

మ. బడికిన్ బంతులు గాఁగ నేగియచటన్ బాపంబు గావించి యు
క్కడి గేస్తుల్ శిరముత్తరింపఁగఁ గడంగన్ రాత్రికిన్ రాత్రి యు
క్కడి కెల్లో తనుమాత్రుడై డిగియె నీ కంకోష్ఠఁ గన్నయ్య పం
గడ మీలాటిది యోగ్యుఁ డిం కెటులు గల్గన్నేర్చు మల్లేశ్వరా॥ 119

శా. దాసీదాసులు దూతకృత్యనిపుణుల్ దారిద్ర్యపుంబమ్మ లే
బ్రాసుల్ నిత్యఫలాంబుభక్షకులు విశ్వస్తాంగనాగర్భని
ష్కాసనపక్రిక్రిమవిక్రిమక్రిములు దుష్కాసపట్వవృత్తుల్ దుర
భ్యాసుల్ పుట్టిన వంశ మం దనఘుఁ డేలా? పుట్టు మల్లేశ్వరా॥ 120

శా. ఆసన్ గాసిలి యూర్చి వచ్చినను దా నన్నమ్ము పెల్లుండియున్
వ్యాసుండంతటివానికే నతిథికిన్ బెట్టండు పెట్టండు పైఁ
గా నక్రిమ్ముక తేయఁగాఁ జెడివె నీ కంకోష్ఠఁ గన్నయ్య యా
దోసంబుంగని యుద్భవింతురె సుపుత్రుల్? తండ్రి మల్లేశ్వరా॥ 121

మ. పదిగంటల్ వనకుంత భోజన మొనర్పం గల్గుచే మేటి భా
గ్యదశాసూచక మంచుఁ దండ్రితిథినాఁ డాలోగడన్ రాసి భో
క్త దిగఁద్రావి స్వకుక్షిపూరణ మొనగ్గా జేసి యవ్వానిత
ప్పిదముఁ జెప్పు నపాత్రుఁ డీ తుటుపకున్ దెం పెట్లు మల్లేశ్వరా॥ 122

మ. కులమం దెన్నఁడు గాని ప్రాజ్ఞుఁ డని యేకోశమ్మునన్ లేనికం
కలకున్ సత్సహవాస మబ్బినను సౌఖ్యం బీను మత్స్యకక్రియ-
బలవాలై మను శాబరాంగనలు ము న్నాగర్భసౌరభ్యసం
కుల మౌ నింట వసింపఁగాఁ గలిగి రౌకోకా? తండ్రి?మల్లేశ్వరా. 123

శా. ఈ చండాలుని వంశ మిట్టిదిది తా నేనాఁడు దుర్వృత్తియు
న్నీచత్వమ్మును నేర్చికొన్నయదియో నేఁ జెప్పఁగాఁ జాల సం
కోచం బించుక లేక చౌర్యము మొదల్ క్రూరత్వముల్ గాక దు
ర్వాచాటత్వముగూడ దీనికిఁ జిరాభ్యస్తమ్ము మల్లేశ్వరా॥ 124

మ. కల రీకూళ్ళకు బందుగుల్ పలువు రిక్కష్టుండు దుష్టుం డటం
చల వా రాత్మ నెఱింగియున్ వినఁడు వీఁ డంచున్ గతున్ రోసి యీ
ఖలచిత్తున్ దగ మందలింపక యుపేక్షన్ జూపు చున్నారు దు
ర్బలు లవ్వా రని యెంచి వీఁడు జడుఁడై వర్తించు మల్లేశ్వరా॥ 125

శా. వీఁ డొండున్ దిలఘాతకుండొకరుఁ డుద్వృత్తుండుపూజారియు న్
గూడన్ మూఁగురు తుంటరుల్ మఱియు నీ క్రూరాత్మకుల్ గాక ని
ద్రోడుం డింకొకఁ డిందుఁ జేరె నిపు డివ్వీరుండు గేహాదులం
దోడం దగ్గి దగుల్చు, నీ వెఱుగవాకోకా మున్ను మల్లేశ్వరా॥ 126

మ. మునువీఁడున్ దిలఘాతకుండును వెసన్ బోరాడినప్డీఖలుం
డనుమానింపక వాని యింట నొకరేయగ్గిం దగిల్పించె న
ప్పనికిన్ గ్రామము రోయఁ బోయి మరలన్ వక్రించె నేఁడూరు దు
ర్జనమాన్యం బగు టాత్మలో నెఱిఁగి ధైర్యంబూని మల్లేశ్వరా॥ 127

మ. అనదన్ బ్రాహ్మణిఁగొట్టి టింకనొక దీనాత్మున్ బడన్ మోఁదు టౌ
య్యన దేవాలయమందు దూఱి హరినేత్రవ్యంకముల్ దుష్ప్రవ
ర్తనకై కైకొను టాదిగాఁగలుగు సత్కార్యమ్ములి ప్డూరిలో
వినఁగానయ్యెడి వీనులన్ గొఱవులై విశ్వేశ మల్లేశ్వరా॥ 128

శా. ఆ యీ దుష్కృతు లందొకం డొకటి యన్యంబన్యుఁడై క్రూరతన్
జేయఁగా దుష్టచతుష్టయంబు నల దుశ్చిత్తాశ్రియాలంబియౌ

హేయంపున్ జనమున్; యథార్థగతి నీ కేఁ జెప్పఁగా నేల? దు
ర్జ్ఞేయంబే కనిపెట్టి పాపఁగదె యీ చీకాకు మల్లేశ్వరా॥ 129

మ. అయయో? దుష్టచతుష్టయమ్ము నెడ నీకావంతయున్ శ్రద్ధ లే
దియె నీకక్కఱ మ్మగు నేని గ్రామము చెడున్ మిన్నంటి దుర్మార్గు లె
న్నియొ దుశ్చేష్టలు సేయఁగాఁగలరు దుర్నీతి న్నివారింపవే
నియు నీ దైవతభావ మేమిటికిఁ జండ్రి? తెల్పు మల్లేశ్వరా॥ 130

శా. ఆ నీ మొత్తఁపనమ్ము లో నెఱిఁగిమే యర్వాచ్యకృతి న్మౌని దు
ర్మానమ్మౌని దురుద్యమప్రథముఁడై మాలిన్య మోలి న్నినున్
దా నంటించెఁ ద్వదర్చకుం డది మొదల్ ధర్మ మ్మధర్మమ్ము లే
కీ నీ యూ రడుగంటఁగాఁ దొడఁగె నీదే తప్పు మల్లేశ్వరా॥ 131

శా. ఆ యీ దుష్టచతుష్టయాపశదదుర్వ్యాపారముల్ రోసి నీ
వేయూరేనియు నేగఁగాఁదలఁచుచో నీమాట యాలింపు నీ
సాయంబించుక యున్న మత్కవనపుంబండాసి యా యీ యపాం
క్తేయాపాయముఁ బాయఁ జేయును జుమీ? దీక్షించి మల్లేశ్వరా 132

శా. ఈ వీ యూర్విడనాడి పోవునెడ నాకే చేతగాదొక్కొ? నీ
కేపై పేగిన నర్చయున్నయెడ నాకే యర్చ లేదొక్కొ యీ
తోవల్ త్రొక్కక దుర్మదాంధుల దురుద్యోగమ్ము మాయింత మో
దేవా? గ్రామము బాగు సేయుదము కీర్తిన్ గోరి మల్లేశ్వరా 133

మ. నినుఁ బీఁకం గల రంచు నీవు నను దుర్నీతిన్ బ్రయోగించి చి
క్కునఁ దింపం గల రంచు నేనును మదిన్ గొంకూని యీ ర్వీడిపో
యినచో సజ్జనుకొప్పుకొందు రనుకొ మ్మోట్లని యిచ్చోటి దు
ర్జనులన్ మాపి సుఖమ్ముగా మనుటయే సత్కీర్తి మల్లేశ్వరా 134

మ. మడిమాన్యమ్ములు మంచి యాలయమసామాన్యాపగాతీర మం
దెడలేనట్టి నివాస మిన్ని గల నీవే దుర్విదగ్ధాత్ములౌ
జనులన్ మాపఁగ లేక యేగు నెడ నీ చండాలదుర్వాటిలో
నడు గెవ్వానికి నిల్పుఁ బోదముపదప్పా! వేగ మల్లేశ్వరా॥ 135

మ. "చనఁగా నేటికి ! దుష్టులన్ గెవపి సత్సంఘమ్ముమ్మ రక్షింత" మం
చనె దే నిష్టమ మాంద్యమున్ విడచి ఫాలాభీలవహ్నిచ్ఛటల్
వినియోగింపుము దోషదూషితులపై విజ్ఞానుకూల్యమ్ము నీ
వమమోదింపుము కీర్తిగైకొనుము నీ కామేలు మల్లేశ్వరా 136

మ. కలిపాపమ్మున కాలవాల మయినం గానిమ్ము దేవాలయా
దులు తచ్ఛాంతికిఁ గొంత తోడ్పడుట యెందున్ విందుమో దేవ? యా
తులువల్ క్రిందును మీఁదునుం దెలియకే ద్రోహమ్ములేనిన్ బొరిన్
జలుపన్ సిద్ధ మశుద్ధబుద్ధుల నెటో శాసింపు మల్లేశ్వరా॥ 137

శా. ఈ యూరన్ జనియించు వాఁడుస్వీజుఁడై యేర్పాటు గారాప తా
హీ్రియుక్తుం డగునేని యిట్టి గతి మావృత్తుండు లోనౌ నహం
క్రేయుల్ తెచ్చిరి నెట్టపంటగ, భవ త్తీవ్రాక్షిపాతమ్ముగా
కీ యల్పాత్ముల కేవినిష్కృతియులేనే లేదు మల్లేశ్వరా॥ 138

శా. కూపుర్ల్ రోసినకాడు బ్రాహ్మణుఁడు శోచ్యుం డేని భక్షించునే ?
భదే్రిచ్ఛుం డటుమీఁదఁ బాపము భవద్వ్యాభిషేకమ్మునన్
నివర్తింపింప యతింప లోఁబడక దుర్నీతిన్ బ్రవేశించి గ్రా
మద్రోహమ్మొడిఁగట్టునే ? యదియునేమంచౌనె మల్లేశ్వరా 139

మ. నిగమమ్ముల్ గలవేని సత్కవివచోనిర్ఘాతముల్ తప్పవే
ని గురుత్యాగము ద్రోహమేనిఁగడు దుర్నీతిన్ బ్రవర్తించువాం
డ్రిగబాట్లం బడు టర్హమేని మన యా యల్పాత్మకుండింతలోఁ
బొగులున్ వందురుఁగందుఁ గుందు నొగులున్ బొంగారుమల్లేశ్వరా॥

మ. ధర సత్కర్మకృతపుణ్యపాపములకున్ దాత్కాలికం బౌ ఫల
స్ఫురణం బుండుట నిక్కమేని మన యి పూర్వాష్టుండు తన్మిత్రులున్
స్థిరలోఁ దావకఫాలనేత్రమున దుర్వ్యవస్థితోపాటు ము
ష్కరతన్ వీడి సహోదరప్రతక్షకగతిన్ గైకొందురు మల్లేశ్వరా॥ 141

మ. గురు వన్నన్ భయభక్తిసంభ్రమము లేకోశమ్మునన్ లేని దుం
డిరి కిప్పానికి నెత్తి మొట్టఁగల గండం దన్ను బల్ భక్తి త

శా. అన్యగ్రామమునుండి వచ్చి యిట విద్యావ్యాప్తికిన్ జిక్కి సా
జన్య మ్మంతగఁ గాలమున్ గడపు ప్రాజ్ఞశ్రేణిపై వీని క్రీ
యన్యాయం బొడిఁగట్టఁగాఁ గత మదే మై యుండునో? దైవమూ
ర్ధన్యా? తెల్పఁగదయ్య? నీ వెఱుఁగుచోఁ దత్త్వమ్ము మల్లేశ్వరా॥ 149

మ. ఇతరగ్రామమునుండి యిచ్చోఁ డకు నే రేతెంచినన్ గాని వా
రతిథుల్ గా? మన కట్టివారియెడఁ జేయన్ గల్గుచోఁ గొంచె మే
నితికర్తవ్యము సాయ మట్టి పని కాదే నూరకే యుంట యీ
హాతకం బేదియు లేక వారిఁ జెనకన్ యత్నించు మల్లేశ్వరా॥ 150

శా. రాముస్ గొల్వఁగఁ జావడి న్నిలిపి నిర్లజ్జుండు గాఁడేని త
త్స్వామిప్రాంతమునందుఁ గట్టునె? యనద్వాహమ్ములన్; గట్టు గా
కేమీ? మాలని కందుఁ దా వొసఁగునే? యే బ్రాసి నీ! వీనిమో
మేమాలండును జూచెనే నఘము గాదే? దేవ! మల్లేశ్వరా॥ 151

శా. శ్రీరామున్ భజియించుచావడిని నిస్సీ? శ్రేయమున్ గోరునే
క్రూరుండున్ దనమాలనిన్ పిడిదిగాఁ గూర్చుండఁగాఁ బెట్టునే
ధారాళమ్మగ బ్రహ్మజాతి గృహరథ్యామధ్యమం దిట్టిదు
ష్ప్రారంభుల్ క్షమియింప గ్రామము వృథా పాడౌను మల్లేశ్వరా॥ 152

శా. రామా? నీదగు పేరితో స్థల మెటో రాఁబట్టి నీ నెత్తిపై
రోమం బొక్కటి తెంచి పెట్టి పయి నార్యుల్ రోయఁజండాలుఁ డ
ర్ధామమ్మందుసఁ గాపువెట్టె" నని తద్బ్రాజేంద్రుతోఁ జెప్పికోఁ
గా మాకాజ్ఞ నొసంగు నీ కిది యశక్యమ్మేని మల్లేశ్వరా॥ 153

శా. దూరాలోచన లేక దుర్మదుల నెందుం బెంతు వీ వల్ల దు
ష్ప్రారంభుల్ ప్రజ కాచరింతు రపచారంబుల్ పయిన్ విఘ్న వా
గోరంబున్ గని వారి పొం గడఁచుఁ బ్రాజ్ఞుల్ మొత్తువెట్టంగ" నం
చారూఢిన్ వినవచ్చు గ్రంథములయం దందందు మల్లేశ్వరా॥ 154

మ. వెలిలో నుండిన వాండ్రు కూడు దిని రీ విప్రాధముల్, వీరితోఁ
గలయన్ రోసిన సత్కుటుంబులపయిన్ గారాలు మిర్యాలు ని

ప్పులు నూరంగఁ దొతంగి రే మడిగె దీసందర్భ మో దేవరా ?
తలకున్ మించిన క్రొవ్వు పిండ్రఁ జెఱిచెన్ దత్త్వంబు మల్లేశ్వరా॥ 155

మ. కొఱవి న్మైత్రిని గోకికొన్న యటు లీకాలశ్ కళాఘ్యాసత
త్పరుఁడౌ మామకశిష్యుఁ బట్టుక యిదే వ్యాజమ్మునన్ దిట్టఁ బా
సిరి పాశ్చాత్యుఁడు వాఁడు కొంతవర కెంతే నైఁచి పండ్లిప్పుడే
పిఱుగన్ దన్నెద నంచుఁజై కురికె నావేశాన మల్లేశ్వరా॥ 156

శా. ఏమంచున్ వివరింతు వీండ్రిగతి నాఁ డే మాదురో ? నాకెటో
ఈమందాత్ములు శిష్యుఁడున్ బెనఁగు చో ప్పేమాత్రిమోకర్ణపీ
ఠీమార్గాన ధ్వనించెవేగ చని యంతేవాసి వారించితిన్
మా మూఢాత్ముల నీకునై నలిపితిన్ మన్నింపు మల్లేశ్వరా॥ 157

శా. ఆనాఁ డాతని పైఁ బరిన్ గనిన నీ యావేళ మున్నట్లులే
నే నూహించితిఁ గానిపోఁ బరమశాంతిం బొల్చు విద్యార్థియున్
దా నారీతిగ నుగ్రుఁ డౌట కలదే ? తత్త్వం బిదే యయ్యెనే
వాని న్నిల్పితి దండనాధికృతి నీపైఁ బెట్టి మల్లేశ్వరా॥ 158

శా. ఓ వేరీతినో శిక్ష వాండ్రి కిడు మంతేకాని నే నేనియున్
నా విద్యార్థులు నాదు బంధుగులు నైనం గాని శిక్షించుచో
దైవోద్దిష్టమయయ్యె లోకులకు నీ తత్త్వమ్ము బోధింపవో
దేవా ? ధర్మ మెఱింగి దుష్టులకు బుద్ధిన్ జెప్పు మల్లేశ్వరా॥ 159

శా. శ్రీరామాలయమందు మాలనిఁ బ్రతిష్ఠింపంగఁ గొంకూనఁగా
నేరం దెప్పుఁడు వాఁడు దీప మిడ కుండెన్ నీకుఁ బూజారి యు
ద్రేప్వారంభం బని చింత నొందెడిని ? తత్ప్రాగల్భ్యమూహించి మేల్
పారత్వ మ్మని వాని దౌష్ట్యమును మెచ్చం గాని మల్లేశ్వరా॥ 160

మ. పము రుండన్ పనె నంట ? యూపయి మహేశా ? దాని కావశ్యక
త్వము నుండన్ పతె నంట ? యెప్పు డట సంధ్యాకాలికం బైన దీ
పము వెల్గించెడి నంట ? యర్చకుఁ డిటుల్ వాగంగ నీ పున్న గ్రా
మము నో ర్మొక్కమి కేను జింతిలెద సాంబా దేవ మల్లేశ్వరా॥ 161

శా. వే లాదాయము వచ్చు నీకుఁ జమురే విశ్వేశ ? లేనంత ? దు
ష్కాల మ్మట్టులు వాగఁ జేసెడి నొకో ! కాకున్న నీలాటి వా
చాలత్వ మ్మది యర్చకుం డెచట నిచ్చల్ సేయుఁ ? గావించుఁబో?
కాలన్ గేలను మట్టరే ? ప్రముఖు లాకంకోష్టు మల్లేశ్వరా॥ 162

మ. ప్రతి సంధ్యాసమయమ్ము దీపకృతికిం బాత్రమ్ము గాదొక్కొ ? దు
ర్గతుఁ డారీతిగ వాసు నర్చకుఁడు తత్కాలుష్య మే పూర్తిగా
చొ? తతిన్ పేచెదొ? శక్తి తక్కువయొ ? నీ వొక్కింత గల్పించుకో
వితికర్తవ్యము దోఁప దింపు గతి నీవే చూడు మల్లేశ్వరా॥ 163

మ. మతి లే కుంటివొ ? మాయలోఁ బడితివో ? ప్రమాన్పాటు చేసారెనో ?
ప్రీతికి నామ్మొఖ లెక్కవో ? యకట ? క్షుద్రుం డర్చకుం డట్లునిన్
సుదరామున్ గణియింపఁ డంట ? పలుగా సుశ్లోకుల న్నెట్టి ప్ర
స్తుతచర్చన్ బడఁదిట్టు నంట ? యిది నీ దోసమ్ము మల్లేశ్వరా॥ 164

మ. పరమాపాత్రుఁడు గ్రామపాచకుఁడు మా బంధుండు పూర్వోక్తము
ష్కరుఁడుం దోడఁట ? నీదునర్చకున కీగ్రామ మ్మపేక్షితికిన్
శరణం బర్చకుఁడో ? దురుద్యముఁడుసంసారమ్ము లే దల్ల తుం
టరి కే భీతియుఁ గాని వాని మదిరంటన్ బోదు మల్లేశ్వరా॥ 165

మ. కొమరుం డున్నను వాని శ్రీయ మయినన్ గోరండు ఘోరుండు క
న్నములన్ వైచెడి చోరు లీ హరితకు చెంతన్ వెంక రాఁడేదు మా
ప్రమనుం డొక్కఁడుఁ బాచకాపకుఁడున్ విశ్వేశ ? ప్రోత్సాహకుల్
పమ రె ట్లిచ్చెడి నీదు దీపమునకున్ జర్పింపు మల్లేశ్వరా 166

శా. ఏకాకిత్వమునల్మి నీ యెడలఁ గానీ నా యెడం గాని యీ
లోకమ్మంయనఁ గాని వీఁడు భయ మాలోకింపఁ డావంతయున్
శోకం బ్మాకులు గూయు నవ్వు బటటన్ సుశ్లోకులన్ ; వీని ను
ష్పాక మ్మోగతి నీవు సైఁచెదవొకో ? సర్వేశ ; మల్లేశ్వరా॥ 167

మ. పరపాత్రుఁడు పాచకుం డనుచు నే పాత్రుచ్చితిన్ దాని వి
స్తర మీలింపుము వీఁడు శూద్రుల కొగిన్ శ్రాద్ధమ్ము చేయించుచున్

బోరి నాలోననె చుట్టకాల్చుపనికిం బూనె న్నివారించితిన్
బెరిఁగెన్ వీనికి నాఁటఁగోలె మదిలో ద్వేషమ్ము మల్లేశ్వరా॥ 168

శా॥ మా చండాలుఁడు సర్పకుండు నొకడై మాత్సర్యపర్యాప్తి దు
ర్వ్యాపాలత్వ ముపక్రమించు నెడ నీ ప్రాశస్త్యం బుపాంగమ్ముగా
లేచున్ బాపుఁడు వీఁడు సర్వగతులన్ లేశమ్మునీ తుంటరిన్
సైఁచన్ గూడదు వీని మారణ మవశ్యం భావి మల్లేశ్వరా॥ 169

మ. ఇపు డీ గ్రామము కశ్మల మ్మగుటకే యెబ్బాసి తా హేతు వా
చపలస్వాంతకు వీఁడు మొట్టమొదలన్ జాపండు తద్భర్త్రని
ష్కృపటుండీ యధమున్ స్వగేహమునెడన్ గా బూఁదఁగా నిచ్చె ది
వ్విపరీతుం డల గేస్తు నిల్లు చెఱిచెన్ విశ్వేశ మల్లేశ్వరా॥ 170

మ. అటు లెన్నాళులో వాని కొంపకు శరం దగ్గిన్ రగుల్కొల్పి పై
నెటులో గేస్తయి దాని పొత్తు విడిచెన్ హాయమ్మహాయమ్మ లే
కటుపై నా హతభాగ్యురాల్ వృషలుపై నాసక్తిమైఁ జాలఁ జె
న్నఁటియై గ్రామపుగౌరవమ్ము చెఱిచె న్నానాఁట మల్లేశ్వరా 171

మ. వచియింపం బని లేదు పాపకుని దుష్కృత్యమ్ము మా జాల్మము
ర్వచనీయత్వము కన్న నెక్కుడు భవత్పాదార్చకాఘ మ్మని
ర్వచనీయ మ్మిటువంటి మూఁగురను మా గ్రామమ్మునం గూర్చు నీ
దు చమత్కారము వర్ణనీయ మనుకొందున్ దేవ మల్లేశ్వరా॥ 172

మ. నినుఁ బూజింపఁగ సర్పకుం డొకరుఁ డెందే నుండు నవ్వానిఁ దా
ననయుం డై చెడి "తొత్తుకొంప పడుతొత్తై" కొల్చు జాల్ముల్ గనన్
జనదె చ్చోః నటువంటి తుచ్ఛుఁ డొకఁ డస్మద్గ్రామ జన్మించి సం
ధ్యను నీ కుంచెడి దీప మార్పఁగ నిమిత్తం బయ్యె మల్లేశ్వరా॥ 173

శా. ఈ దుర్జాతుని పెద్దతండ్రి కొడు కెంతే వర్ణనీయుండు త
ద్ద్వేషుష్ట మ్మది పుట్టకాల్చుకొని యుద్వేషగ్రిషన్ మెచ్చికొం
చో దేవా! నడివీధి నేసు తటి నీ వాక్సంత మూదనెవరెన్
క్షీద న్నిల్చుఁడు క్రిండ నిల్చఁ దవి యేమీ? శివ మల్లేశ్వరా॥ 174

శా. చుట్టల్ కాల్చెడి వారలున్ గలరు, బల్ షోకుల్ గనం జేయుమేల్
ఒట్టుల్ గూడఁ గలారుగాని మన యీ దద్దమ్మ చందమ్మునన్
మెట్టం బల్లము రెండునుంగనక మిర్మిట్లుల్ వెలారించు నీ
కొట్టుం బాపని మాత్రి మింకొకటఁ గగ్గోఁ బోవు మల్లేశ్వరా॥ 175

మ. తనకుం బాటకు దిక్కు లేమ తన దుర్దర్పాంధ్యమో : పట్టుకోఁ
గను బిగ్గమ్ములు లేక యున్న యది యీ కంకోష్ఠ నీ వింతకున్
మునుపే చంపితి రక్తబీజుని గతిన్ మోమెత్తిడిన్ వీని కిం
కను గావించెడి శాస్త్రి వేఁడొకటి వక్కాణింపు మల్లేశ్వరా॥ 176

మ. పరిశీలించిన వీని వర్తన సురాఖాండేశ్వరగ్రింఫ మీ
పెరుగుందాటులపాడగట్టకు దురావేశమ్ము బల్ మెండు కరా
ళరయం బార్తిగఁ గల్గుచో నిలుచు వీఁ డాకాశమార్గాన నీ
కెఱుఁగన్ రానిది లేదు వీని నిటులే యింకింపు మల్లేశ్వరా॥ 177

శా. పొట్టన్ బట్టుక చింపి చూచినను నే పొంతేవియున్ ముక్క లే
వెట్టో తప్పుడు లెక్కలన్ గిలుకు వీఁ డీలాటి దుర్బుద్ధి యీ
కట్టున్ బొంగకు సిగ్గు లే దొరులపైఁ గాల్ ద్రివ్వఁ గూఁడున్నచోఁ
బట్టన్ బిగ్గములున్నె ? వీని ; కిపుడే బల్ క్రమ్మోఁగు మల్లేశ్వరా॥ 178

మ. పరిశీలించితి వీని కిచ్చితివి భాగ్యమ్ము వీఁ డంతలో
పటమోహై బ్రియకంగ నే రక వృథా యస్మాదృగవ్యాజకాం
తిరసోద్రిక్తుల సారెకున్ జెనకుచున్ ధిక్కారముల్ సేయు నీ
పరిపంథిన్ మతియుణ్ణ దర్బ్రమసిగ సంబాళింపు మల్లేశ్వరా॥ 179

మ. ఇపుడే వీఁడు దరిద్రుఁ డింక నెటులే నివ్వాని దారిద్ర్య దో
షపరీతుం బొనరింప నేర్తు ననుచున్ శంకింతువో ? సత్యమే
చపలుం డీ వటుఁ డింప మాత్రిసిరి గాంచన్ గాఁడు పాత్రుండు క
ష్టపదన్ వైచినఁ గాని వీఁ డుడుగఁ దుడ్డీనంటు మల్లేశ్వరా॥ 180

మ. అతి సత్రమ్మున వీని కొక్కపవి యస్వతర్రి విచారింప నా
జెలమిన్ మానము ముట్టు నిట్లు పదియూటీరీతి ; నీ రెంటి క్రో

పల సంప్రిమ్మున వీని కిచ్చు ఖ్యాతి యాపన్ మేలు వీఁడా ఖ్యాతిన్
గలయన్ మెచ్చుచు వచ్చునయ్యతిథులన్ గారించు మల్లేశ్వరా॥ 181

మ. అతిథిన్ వచ్చినవానిఁ గాంచి పసరమ్మట్లుల్ బుసల్గొట్టు వ
క్రిత చూపించుఁ బ్రభుత్వము న్నెఱపుఁ బైఁ గాఠిన్యము న్నించు ని
ర్గతుఁ గావించు నదేమి పాపమొకొ? యీ కంకోష్ఠుఁడా సొమ్మెటో
పితృవర్తమ్మని మెక్కు జీతపుమిషన్ బెంపేది మల్లేశ్వరా॥ 182

మ. తనునే నీ కెటువంటి దుష్టుని గుమాస్తాగా నియోగించి యి
ప్పగిదిన్ సత్రము పాడుచేయుమని ; పాపవ్యాపృతుం డైన యి
ప్పొగరుంబోతు వృథాగ మేపు టదియుం బున్నెంబె? మేల్మేలు? నీ
నగుబాటుంబని దేవతల్ నగరొకో? నాకాన మల్లేశ్వరా॥ 183

మ. కడఁకీ యూరన సత్రముండుట కయో? గర్వంబునం బెద్ద యా
గడెకుం బూర్వమె రిక్తుఁడై వృథగ దుర్గర్వాంధుఁడై కూటికిన్
మడిమాన్యమ్ములు లేని దద్దమకు నన్నప్రాశనం బబ్బుటే
కడు దొడ్డౌ పురుషార్థమొక్కొ? యిది దుష్కార్యమ్ము మల్లేశ్వరా॥

మ. గుడిఁ గట్టించుట యర్చకార్థమయి తక్కెంగల్గు సత్రాదు ల
క్కడ వర్తించెడి కూలివాండ్ర కనుచో గర్వాత్ము లైపోవె? యీ
గుడులున్ సత్రములున్ భవత్ప్రభుత యీకుగ్రామమం దెట్టులో
చెడి పాపమ్మును వృద్ధిచేయఁదొడఁగెన్ శ్రీకంఠ మల్లేశ్వరా॥ 185

మ. ఎఱుఁగు న్నెమది యర్చకుండు గుడికీ యే జాసి సత్రానకుం
గరముం ద్రోహ మొనర్చు దొంగ లని; యీ కష్టాత్ములన్ సైఁచి యీ
చరితమ్మంచునఁ జాలు పంచికొను నీతో నెంతగా నే నిటుల్
మొఱపెట్టంగల? దొంగలన్ గుఱిచియా? మోమోట మల్లేశ్వరా॥ 186

శా. సత్రమ్మంచును బాప మే యతిథియో సాదమ్ము నాసించుచున్
గాత్ర మ్మెల్ల శ్రమాంబులన్ దొరఁగి రాఁ గష్టాత్ముఁ డీ తుల్య యే
మాత్రమ్మున్ వసు లేక కాఱు లఱచున్ మర్యాదకున్ దక్కి; యీ
సత్రమ్మక్కట? వీని యబ్బ ధనమే చర్చింపు మల్లేశ్వరా॥ 187

మ. కనరాఁ డొక్కఁడుఁ గానవచ్చినను దుర్గర్వాంధ్యముం జూపు ని
స్స్వనముల్ నించును చల్వ తీయఁ డదియున్ సంభూత మౌచోఁ బదా
ర్థనికాయమ్మిడ కేడిపించు నిఁక నత్రి మ్మెందుకీ యూర దు
ర్మనసుం డీ చెడు గాహరించు పని కేర్పాటౌనె ? మల్లేశ్వరా॥ 188

శా. ఎస్టేటుల్ తలకిర్రిందుసేసెడి దివా న్లీమంతుర్రిలన్ దిద్దు ను
త్కృష్టుల్ మేటికిరీటము ల్గలరు గానీవారియుం దెందు నీ
కష్టాత్ముం డొనరించు టె క్కొకటియున్ గన్పట్టఁబో దీ కుల
భ్రిష్టుం డెందుల కింత మిట్టిపడునో ? వాక్రుచ్చు మల్లేశ్వరా॥ 189

మ ఒకలేశమ్మును సత్క్రముంగుఱిచి వీఁ డొప్పండు కష్టింప వే
ఱొకచోఁ గుక్కయుఁబోతెఁ బాటుపడు నే యొక్కింతియో తెచ్చుకో
నకటా; వీనికి నిచ్చు జీత మది యేలా జీర్ణమౌచున్నదో?
సకలజ్ఞుండవు నీ వెఱుంగవటె విశ్వత్రాణ ? మల్లేశ్వరా॥ 190

శా. ఏతాదృక్కుజనాగ్రణుల్ గలరు మాయీ యూర నీ లెంకయా
యీ తుంటర్లకు నేత నిన్గుఱిఁచి యేరే నింత మాటాడనీ
కోతుల్ బూతులకుం గడంగెదరు కన్గోవీవు దుష్టాలపుం
జాతుర్య మ్మనుకోవలెన్ భవదుపేక్షిబుద్ధి మల్లేశ్వరా॥ 191

మ. తన దుస్తంత్రము సాగుచోం టెనొక బృందం బుంట యావశ్యకం
బని హేయాన్నము గుద్చె నర్చకుఁడు మా యజ్ఞాత్ము ద్రేరేచి య
ప్పనిచే వీఁడు గళంకె యయ్యెనివు డపాపమ్మునన్ వీని వ
ర్తన సర్వమ్మును బాడువారినది తత్త్వంబింత మల్లేశ్వరా॥ 192

సరిగా దేవునిఁ బూజసేయు మహసాక్ష్యపక్రిక్రియల్ మాని పూ
జరివై గ్రామపుసమ్మతిం గొనుము దుశ్చారితక్రియల్ లోటు లె
వ్వరికిం గూడవు నాఁగ నాపయి వృథావై రమ్ము వీఁ డూనె దే
వరచిత్తమ్మున కంతయున్ విశదమే వా దేల? మల్లేశ్వరా॥ 193

శా. నీపై నీ వచనంబు చెప్పుపనికి న్నెలెంక నైనంప కా
లాపింపక దొఱఁగెన్ దురుక్తుల ననున్ లక్ష్యమ్ముగాఁ జేసి సం

తాపింపం బనిలేదు దీనికయి నీ తత్త్వం బెఱుంగున్ మహా
పాపాత్ముం డల వాఁడునే నెఱుఁగమిన్ బ్రార్థింతు మల్లేశ్వరా॥ 194

మ. పొలమం యుండినయిట్టినాపయి నెటో పొల్పెం గదా ? కేసు, దు
ర్బలచిత్తుండు త్వదర్చకుం డది యథార్థం బౌనో కావో ? విని
ర్మలచిత్తుం డధికారి నేర్చె సరియే ప్రామాదికత్వమ్ముమైఁ
దెలియం జాలక యున్నఁ జిక్కగునుగాదే! తండ్రి మల్లేశ్వరా॥ 195

మ. ఎవఁడో డబ్బిడి తద్దినమ్ము గొనె., నం చే వింద నప్పోల్కి నీ
యవివేకుల్ చవి గాని వ్యాజ్యముల ద్రవ్యం బిచ్చి కైకొంచు దు
ర్వ్యవసాయమ్మునకున్ గడంగి దురుపాయవ్యాపృతిన్ జిక్కిని
న్నవమానింపఁగడంగినా రెఱుఁగు మయ్యా ? దేవ మల్లేశ్వరా॥ 196

మ. తన గిన్నెం బరమాన్న మొక్కఁడు దినం దా నల్ల యవ్వాని పా
త్రను భక్షించె నఁ టెద్దియో యొకఁ డమేధ్యం బైన దుర్వస్తువా
ఘనునిన్ బోలిన బ్రహ్మబంధు వొకఁ డీ గ్రామానకున్ ముప్పు దె
చ్చెను దావృక్కృతి చేసి వీఁడడచె నీ శ్రేయమ్ము మల్లేశ్వరా॥ 197

శా. దీపం బేటికె రాత్రి రాతి కని వాదింపన్ మొదల్వెట్టు దు
ర్దీపర్యాప్తుల యాజమాన్యములు నీ దీనస్థితిన్ బాపఁగా
నోపం జాలవ; యాస్తికప్రభుని వేతాం డొక్కరుం బట్టి యీ
లోపమ్మున్ సవరించుకోఁగ మది నాలోచింపు మల్లేశ్వరా॥ 198

మ. తనపైఁ గాళ్ళను సాచు సాహెబు నెటుల్ దాఁగొట్టఁగా లేక త
న్ననిశమ్మున్ గడు భక్తితోఁ గొలుచు నయ్యాసాదిఁగొట్టెన్, భవ
ద్వనితారత్నము నీవు నట్టులనె యిప్పట్లన్, బ్రవర్తించినీ
పనికై యాస్తికు నాశ్రయించుటె మహోపాయమ్ము మల్లేశ్వరా॥ 199

మ. ఉదరమ్మున్ మఱి యొంతు రెంటికొఱకే యుత్పత్తి, యీ రెంటికిన్
సదుపాయమ్ము ఘటించు టన్నదియె మోక్షం" బంచు వాదించు శో
చ్యవశోపేతుల యాజమాన్యములు నీ యైశ్వర్యము న్నిల్పఁగా
నెద నూహింపవ, యాస్తికున్ వెదకికొ మ్మిమ్మైని మల్లేశ్వరా॥ 200

మ. భగవంతుఁ బూజియించు పెల్లరకు సంపన్నంబు, యట్లాచరిం
చి గడింపం దగు భాగ్యమే ? మది పరశ్రేయస్సటుల్, సేయకుం
డఁగఁ దిన్నన్ బెఱవారు దూఱ, రిఁక నిన్ దక్కంగ నీ యర్చకుం
డాగి మెక్కన్‌బరు కొప్ప రియ్యది మహాయోగంబు మల్లేశ్వరా॥201

శా. ఈనీచాతి వినీచవర్తనుఁడు మా హీనాత్ముఁడుం గూడి యె
ట్లేని న్నా కపకారమున్ సలుప నెన్నేనాళ్ళు యోచించి యే
యోనిం గూడ జనింపరాని యొక దుర్యోగున్ జతుఁడ్ రా యనం
గా నొప్పందగు వానిఁ గైకొనిరి కుక్కంబోలె మల్లేశ్వరా॥ 202

శా. ఈ నిర్భాగ్యున కస్మదీయ గృహసామీప్యమ్మనందున్న దం
గానీక ప్పుఖిలమ్ముగాన్ సడలి పాడై యున్న యి ల్లొక్కఁ డ
ట్టానిన్ వీనికతానఁ గైకొని స్వదుస్తంత్రమ్ములై రాగి యే
గానిం గాని వృథావివాదము లకున్ గాంక్షింతురీ మల్లేశ్వరా॥ 203

శా. జాతిన్ మాలలుగా జనించియును విశ్వాస్యుల్ గలా రెందు మా
యా తుచ్ఛుల్ ద్విజు లయ్యు వర్తనమునం దే మాలలుం బోని టు
ర్నీతిన్ జూపుట వీండ్రి పట్ల మదిలో నే నెంతు వద్వైవ చనన్
జాతుర్యమ్మున వీండ్రి దగ్గఱుట కాసన్‌గొందురీ మల్లేశ్వరా॥ 204

మ. ఒకచో వీండ్రిటు దగ్గఱంగ మది కెంతో యేవమై యా పొలం
బొక సచ్ఛూద్రున కమ్మ టీ వెఱఁగియే యున్నావు నేఁ డింటి వ్రి
క్కకు రాఁగాఁ బ్రియ తింపు వీండ్రికపటాఘమెట్టిదో చూడు మీ
యొకసక్కెమ్ములె వీండ్రి పొం గడఁచుఁ బూమ్రి నమ్మ మల్లేశ్వరా

మ. దరిగా రా వెనుకంజ వేయ పరికే తా వచ్చు చండాలు మా
పరిగా దైవహతాయతుల్ రిపులు మద్గేహాంతికస్థలం
బుపమన్ జొచ్చిరి సత్కవిప్రవరులు వీండ్రిమాలముగా బ్రుక్కియు
క్కఱి మద్వాణికి వన్నెవెట్టుపనికే కావచ్చు మల్లేశ్వరా॥ 206

శా. అందుం బాఱుపనాగ మొక్కనిది యన్యం బన్యదీయంబు దా
నం దూర్పేమన మందభాగ్యులు గొనన్ యత్నింతు రీ భాగమే

చెందున్నామగ్రుహాన కక్కతననే చీవాట్లమారుల్ వృథా
చిందుల్ ద్రొక్కికొనన్ దలంచునది యే చే టొక్కొ మల్లేశ్వరా॥ 207

మ. తమకుం దగ్గఱియుండు బడ్మరది యద్దానిన్ దిగన్ ద్రావి ఘో
రమునందున్న పరిదేశమున్ గొని ననున్ వ్రాత్యుల్ మ తేమేని జే
య మదిన్ బొంగెద రంట? గ్రామమఖిల “మ్మయ్యో? వృథా వీం(డు)భ
స్మముగాఁ బోయెద” రంచుఁ దిట్టినను లోజం కేది మల్లేశ్వరా॥ 208

శా. “ ఈ కుంకమ్మలు చెళ్ళపిళ్ళకవి నెంతేఁ గుర్రిద్ధుఁ గావించి త
త్ప్రాకట్యప్రథమాన వాగసిహతిన్ భ్రష్టాయతిశ్రీకులై
డేకన్ జొచ్చి” రటంచు లోకులనుకో డీల్పాటు వాటింపు మో
శ్రీకంఠా? యది గూర్చు గ్రామమునకున్ నేమమ్ము మల్లేశ్వరా॥ 209

శా. చెప్పుల్ కాళ్ళను దాల్తు లెల్లరును వాసిన్ గోచి కాఁబోలు మా
మొప్పెల్ వానిని నోటఁ దాల్చెదరు నో ర్మూయింప నీకన్న మా
యప్పా? వే ఱొక రేరి? వీండ్రన నమేధ్యంబంచు లో నెంచు వా
రి ప్పూర్వాపులు నీకుఁ జెప్ప దిఁక నీ యేవంబు మల్లేశ్వరా॥ 210

మ. వెలి యన్నారకమంచు గూలిరి వృథావేశమ్ము నై వీండ్రు త
త్కలుషానన్ బడి మ్రింగి వీరలపయిన్ గ్రామువు ద్వేషించె న
వ్వల నీ యయ్యల కంకురించినది నాపై నీను తద్ద్వేషమే
కలికే నాఁకలి గొల్పి వీండ్రు నడఁపంగాఁ జొచ్చె మల్లేశ్వరా॥ 211

శా. పాపాపస్మరణాఖ్యరోగము నెడన్ బాంధవ్య ముండెన్ గవీ
ట్చాపంబుండెను వీం డ్రిడంగుటకు నీ సాహాయ్య మింకేల? ద
వ్వైపో నుండిరి కూడు గుడ్డలకు తథ్యం బింత నీ సాయమున్
బాపిపోచో నవి శీఘ్రకాలముననే ప్రాప్తించు మల్లేశ్వరా॥ 212

మ. ఒకచోఁ దప్పినఁ దప్పు నీ యశికదృగ్యోగంబు వేఱొక్కచో
వికలం బై చనుఁ గైటభద్విడరి యా వేశంబు సత్కాపృక్ప్ర
త్పకటానర్గళశాపచాపగళిత బ్రహ్మాస్త్రమంత్రాక్షరం
బెకసక్కెమ్ము లడంచి చెంపలను వాయింపించు మల్లేశ్వరా॥ 213

శా. పంచత్వమ్మను వీండ్రికి మ్మనుచు నిన్ బ్రార్థింప నేమంటివా ?
పంచత్వ మ్మది వీర లేవు రగుటన్ బాప్తింపె జన్మానసే
పంచత్వ మ్మనఁ జావు నౌనదియు సంపన్నంబు యెట్లన్న ; బల్
కించఁ గూర్చువెలిన్ జలింపకయె యున్కింజేసి మల్లేశ్వరా॥ 214

శా. ఎంచన్ బంచత గూర్చునీతి యొకయింతేనిన్ గనన్ రామ య
త్కించిద్ జ్ఞానము లేని శుంఠలకు నాకించన్యమే జ్ఞానమున్
గాంచన్ సాధన మద్దియే పరికృత మీ కంకోష్ఠులన్ జేర్చి దు
శ్చంచద్వృత్తన మాఁగఁ గొక్కి యిదియున్ సాధ్యంబ మల్లేశ్వరా 215

మ. ఒక గర్వేని గడింపఁగాఁ దగిన వాఁ డొక్కండు సోదర్యపం
చకమందున్ గనుపట్టఁ డున్నధన మాజన్మంబు దుర్వంచనా
పకృతిప్రాప్తము గాన నట్టె సురిఁగెన్ భావ్యంబు దారిద్ర్యమే
యిఁక నీ కీకృతియందుఁ గష్ట మది లేనేలేదు మల్లేశ్వరా॥ 216

మ. గరువంబున్ సడలించుఁ గామము నడంగన్‌జేయు వాచాటతా
భరమున్ దించు విధేయతాగరిమమున్ బాపించు నాత్మీయదు
శ్చరితంబున్ గనఁజేయు జాడ్యము నడంచన్నేర్చు దారిద్ర్య ము
ర్వర నీ యౌషధ మెల్లరోగములు పాపం జాలు మల్లేశ్వరా॥ 217

శా. దారిద్ర్యమ్మనఁ గాని చక్కఁబడ రీ దర్పాంధు లీ యోగమున్
బ్రారంభించియె యున్న దిందుకుఁ గృషిప్రకాంతియే సాక్షి మ
ద్వైరోదారకవిత్వమున్ ద్వదురుకోపస్ఫూర్తియున్ రెండిటన్
జేరంగాఁ బని లేమ చూచెదు మదాశీశ్శక్తి మల్లేశ్వరా॥ 218

మ. కృషి దుర్భిక్షమడంచు నంటయు నిజంబే కాని యీ శుంఠలీ
కృషివల్లం జెడి బిచ్చమెత్తికొను మాచే నిక్క మేనాఁడు వి
ర్కృషి కిం బూనిరొ నాఁడె బోదెకలహం బేర్పడ్డ దామీఁద నీ
భషకంబుల్ వెసఁ గూయుకూఁత లవి చెప్పన్ రోఁత మల్లేశ్వరా. 219

శా. బాసం గోరిన కార్య మెయ్యదియు దుష్ప్రారంభి గాఁగూడ దే
యోగో యట్లగు నేని దాన నగు నీ యోగ్యేతరుల్ దుర్వచః

ప్రాగల్భ్యమ్మన బోదె కష్టపడి మద్వాగస్త్రిపై శ్వానర
శ్రీ గర్గోల్వడి బెండువారి రవి యే చేటొక్కో మల్లేశ్వరా॥ 220

శా. కాడిన్ వీండ్రు ఋజానఁ దాల్చినపుడే గర్వాంధకారమ్ముపై
గావం గూరెరి బోదె కష్టపడి నన్ గాయల్ వృథా వానిచే
మాడెన్ మోరలు దానిపిమ్మట మహామాత్సర్యపర్యాప్తిక
ద్వీప్రిడాకారకపంక్తిబాహ్యకత చేరెన్ వీరి మల్లేశ్వరా॥ 221

మ. పరమామేధ్యకదన్నభక్షణము సల్పంబోవుటన్ వీండ్రు బా
హ్యులై రిప్పుడు వీండ్రకొంప కెవఁడో హీనుండు దక్కంగఁ బో
వడు శుద్ధుల్, స్వకృతాఘ మి ట్లెదురఁగా వైరమ్ము మైన న్నెటో
చెఋపంజూతురు తమ్ము నెల్లరును నిష్ఠీవింప మల్లేశ్వరా॥ 222

శా. దారిద్ర్యం బన వేఱె యున్నదియె నింద్యంబైన దుర్వృత్తియున్
గారాగారముఁ జేర్పఁగాఁ దగిన దుష్కార్యమ్ములున్ దుర్గుణ
స్ఫారోదారత దుర్వచఃప్రస్మృతి మస్తంత్రమ్ములుం గాక దు
ర్భిరమ్మన్యత వీండ్ర నిట్లుకఁచె నుద్రేకించి మల్లేశ్వరా॥ 223

శా. దారిద్ర్యమ్మన వేఱె యున్నదియె విద్వద్వేషవిద్యాబహి
ష్కారప్రాప్తినికృష్టదేవలకనిస్సారోక్తిసంసక్తిలో
కారాధ్యాత్మగురూత్తమాం ఘ్రియుగళన్యక్కారముల్ తక్క మ
ర్వారం బయ్యది మున్నపైఁబడియె నిర్వర్ణింపు మల్లేశ్వరా॥ 224

శా. ఈకష్టాత్ముల భావికాలగతి కీ వే మందువో కాని నీ
వేకాలమ్మున నెన్నడుం గనఁగఁబో వీలాటి దుర్మార్గులం
బాకీవొడ్డిగ వీండ్రు గైకొనిరి సూ ? మాహాత్మ్యాలాగ్రహం
బీ కార్యంబును సైఁచు నీ సహనమే హేయంబు మల్లేశ్వరా॥ 225

శా. ఆయుర్దాయము నాకు దీర్ఘముగ నీ వర్పించియే యుందు లే
దా యీమాత్రిమ చాలు నెక్కడికి నీయాశాపిశాచమ్ము లి
ట్లే యుండున్, బని యొక్కఁ డుండి నిను నే నిష్టట్లఁ బ్రార్థింతు దీ
ర్ఘాయుర్దాయము దానిఁ దెల్పెదను నీ వాలింపు మల్లేశ్వరా॥ 226

మ. వృథగా సత్కవిపైసి గాసు తమకెంతే శ్రేయమున్ సాచెఁ గూ
ర్చు ధరాదేవతపైనిఁ గాసు గుసపై క్షుద్రక్రియన్ సల్పు దు
ష్పథగాముల్ గను మర్గతుల్ సకలమున్ సాక్షాత్కృతిన్ జేసి కో
పథమద్విడ్వ్యధితుండు వీఁ డడిగె దీర్ఘాయుష్షు మల్లేశ్వరా। 227

శా. ముండాకొడ్కులు తీరి కూరుచుని తమ్ముం దాను పెన్పాపపుం
గుండానన్ బడ నెట్టుకోఁ దలఁచి రీ కుంకల్ స్వకాఘమ్మిటుల్
పండన్ బాఱఁగ నన్నవస్త్రములకుం బల్ దవ్వుగా నూరి కో
క్కుండై పోఁగల రీవు నేనును గనంగా నమ్మ మల్లేశ్వరా। 228

శా. "అమ్మా? బువ్వయు నయ్యా? బువ్వయు"నై యాత్మీయ పాపప్రవా
రమ్మెల్ సారెకు జ్ఞప్తి రా నవయు దుర్వ్యాహారముల్ వీండ్రు క
ర్ణమ్మెల్ సూడఁగ సాఘులన్ గురిచి మీఱం బల్కుచున్నారు దౌ
ష్ట్యమ్మే మని చూచి సైఁచెదవొ? యన్యాయంబు మల్లేశ్వరా॥229

మ. గుణముల్ లెక్కయె లేదు పాప్పు లనినన్ గోఁచన్ వెసన్ మీఱు నర్
పరికీలించుచు లేవ ధర్మపరులన్ బాపమ్మె యన్నమ్మెగా
నరకంబే పర మంచు మున్నఱకమై నానాటికీ దున్న లే
క్కెల వర్తంతురు వీండ్రు కేగతియొ? తండ్రీ? తెల్పు మల్లేశ్వరా.230

శా. ఈ రండాకొడుకుల్ మదీయధనమై యేర్పడ్డ పద్మమ్మనం
బారాధమ్మగు వస్తుజాతమును వీండ్రిచ్చెమొ యార్జించిన
ట్లారంభించిరి యాత్మసాత్కృతికినై యాయుష్షు క్షీణించి మే
యీ రౌడీ లొనరింపఁ బూని రిది మస్కృత్యంబు మల్లేశ్వరా॥ 231

శా. ద్రవ్యం బిచ్చితిఁ బత్రమున్ జరిగెఁ దత్స్వత్వంబు నావయ్యె నీ
కవ్యాప్తిప్రవిలుప్తనావిగతు లే కర్మానునో వానితో
సువ్యక్తమ్ముగఁ జొచ్చి వస్తుతతిఁ గొంచుం బోవుచున్నారు హం
తవ్యుల్ కాక మ ఱెట్టిదో? నొడువుమా? తథ్యమ్ము మల్లేశ్వరా॥ 232

శా. హంతవ్యత్వము వీండ్రకర్మముల సిద్ధాంతమ్ము గావించి పై
గొంతుల్ నొక్కెదొ? యన్నవస్త్రములకున్ గోడొందఁగాఁ జేసెదో?

చింతన్ జొచ్చెనో ? రుగ్ణులన్ సలిపెదో చేట్పాటు పాటించెదో ?
యంతమ్మెట్లు ఘటియించెదో సుంపు నీకైనటు మల్లేశ్వరా। 233

శా. రాముం డొక్కఁడు భీముఁ డొక్కరుఁడు సూతుం డొక్కఁడున్ వారల
ప్రామాణ్యమ్ముగలట్టి సత్కవులు తత్ప్రాగల్భ్య మిప్పట్టి మ
ర్ధీముగ్ధారిపథోద్యమప్రసణమై దీపించు మద్వాక్యసం
దేమాత్రమ్ము ప్రవిష్టమై సలుపుఁగా కీర్తప్పు మల్లేశ్వరా॥ 234

శా. పందిం దింటివి నీవు పందలను నే భక్షింప నున్నాఁడ నీ
కందం బయ్యెను బందిఁ దిన్కతన మాయాభిల్లవర్త మ్మొగిన్
బందన్ మెక్కెడి నాకు ప్రాత్యతయు సన్మార్గమ్ముగాఁ జెల్ల దే
మందున్ సైతము పందలన్ విన కెహో భ్రమందింత్రు మల్లేశ్వరా 235

శా. "దుర్మార్గుల్ విన రేమి సేతు"మని శూద్రుల్ బ్రాహ్మణుల్ సర్వులన్
మర్మం బుప్పిపడంగ నాడగ నోగిన్ మాయుం టికిన్ బంధులన్
దుర్మోదమ్మునఁ బోలు ప్రాత్యుల నెటుం బ్రమంగింప లేకున్న నా
పే ర్మార్పే రిడికొందుఁ జూచెదవు నాపేర్మాసి మల్లేశ్వరా॥ 236

శా. పందిన్ మద్గృహసీమకుం జొనిపి యే పందన్ బ్రయత్నించు న
ప్పందన్ మత్కవితాస్త్రపాతమున నిప్పందింప నుంకింతు నీ
విందున్ సాక్షివి నే నిమిత్తము కృతాంతేచ్ఛావశుం డౌచు న
మ్మందుండే యిటు పర్విందుచుండె హతమన్మానాన మల్లేశ్వరా। 237

శా. పందల్ సత్వవిశేషమున్ గొరఁగఁ దొడ్రవన్ సేసి పెల్లుబ్బిన
ప్పందన్ దైవముపేక్ష సేయునె? తదావాసమ్ము గోమాయు గో
విందధ్యానపరీతమున్ సలుపదే? విశ్వేశ ? నీవంప నా
నందమ్మొప్పఁగ నాట్యముల్ సలుపవే? నానాఁటి మల్లేశ్వరా॥ 238

శా. పందిన్ మత్పరిపంథి మద్గృహ సమీప స్వైరసంచారిగా
మందాత్ముండొనరించె గోడయిడికో మానుస్ దొసంగిద్ది ము
న్మందీ పందగృహాంగణమ్ము నెడకుందోతెంచు గోమాయురా
డ్బృందాక్రందన మీనయాఁగవలెఁజుమ్మీ? వచ్చి మల్లేశ్వరా॥ 239

శా. పందిన్ దోలియుఁ గుక్కలన్ వరిమియుం బాపాన్నముం దిన్నయా
నిందన్ బాసి మదీయ పంక్తికడకీ నీచుండు రా నేర్చునే ?
పందిన్ జేర్చిన నొప్పినన్ సుజను లిప్పందన్ దరిన్ జేర్పఁగా
సందీబోరిది నీమనంబు నెఱుఁగున్ సర్వమ్ము మల్లేశ్వరా॥ 240

మ. అమరుల్ పందికిఁ బంచకుం గలుగు నీ యాభేదమున్ సర్వముం
దమదెంచమ్ముల గుర్తెఱుంగుటయు. పందన్ బందికన్న న్నికృ
ష్టముగాఁ జూతుర తద్వినీతియును దచ్ఛాంతిప్రకారమ్ము త
త్కార్యమవర్తిత్వముపంద కెట్లులవడంగా నేర్చు ? మల్లేశ్వరా॥ 241

మ. బలసంపన్నత భూతలమ్మఖిలమున్ భస్మమ్ము గావింపఁగాఁ
గలదయ్యున్ బసిబిడ్డ బెడ్డవిసరన్ గంపించి చవ్వేగుఁ. ద
ల్పుబ గొణ్ణెమ్ములునుగ్గు సేయఁ గలదై లోఁగొంకియట్లేగ దే
యలఁతుల్ పందిని బందగాఁదలఁతురయ్యా ? దేవ ? మల్లేశ్వరా 242

మ. విరుగుంబాటువనమ్ముతే కొదిగియే వీథీపరిదేశమ్ము నం
దిరుగున్ దేవుఁడొసంగినట్టి నడకేదిక్కైక ప్రవర్తించు, వం
కరగాఁడింకరగాఁజరింప దెఱుఁగంగానేర్చు నాత్మీయ దు
శ్చరితం బెల్లను బంది బందకిది పూజ్యంబయ్యె ? మల్లేశ్వరా॥ 243

మ. వెలినుండందగునాత్మ మశ్చరిత మేవిజ్ఞుండెఱింగించెనో
కలకాలమ్మది యట్లె యుండెడి బహిష్కారమ్మునందుండె యు
వెలియంజాలక మేరమీఱి కడు నుద్రేకించెడిన్ బంద, పం
దులకుం బందల కెంతయంతరమొ ? కన్గోవయ్య మల్లేశ్వరా॥ 244

శా. మ్లేచ్ఛుల్ పందినభక్షకరించెదరు, తన్మేదోవసా మాంసముల్
స్వేచ్ఛందమ్ముగ బాహుజుల్ మొదలు భోజ్యంబంచు భక్షింత్రుబల్
తుచ్ఛుల్ పందల మాంసమో ? తినరు వ్రాత్యుల్ గూడ, నేమన్న నే
తచ్ఛీలంబతినింద్యమౌటయె నిమిత్తంబింపు మల్లేశ్వరా॥ 245

మ. ఇఁక భక్ష్యత్వతదన్యతా విషయ మందేమాత్రమున్ లేదు పం
దికి సందేహము, పందకన్న ; నదిమున్నే సర్వత శ్శూన్యమీ

యెకసక్కెమ్ముల మొప్పెకీ నియతి లేకే పంక్తిబాహ్యాత్వ నా
రక కూపస్థితి దర్దురార్భటులు సంప్రాప్తింపె మల్లేశ్వరా॥ 246

శా. శ్రీరామాధవునంతవాఁడు జనియించెన్ బందిగాఁ బందగా
నేరామాధవుఁడేనిఁ బుట్టెనొకొ ? యాయీకారణమ్మెమహా
దారంబౌఁగద ? పంది? దానినటు మద్ధామాంతికస్థమ్ముగా
నారందోలిన పందకే నతులి వే యర్పింతు మల్లేశ్వరా॥ 247

మ. చదువున్ సందెయులేని దుర్భగులునిచ్చల్ పందులన్ ద్రోచి గా
డిదలన్గాచి కుటుంబ రక్షణమెటో దేకింతురీ కుంక లీ
వదరుంబోతులు భావిమర్తికి నైవక్రించుచున్నారు, త
ప్పదు కర్మంబునుబట్టి బుద్ధియిటులే వక్రించు మల్లేశ్వరా॥ 248

శా. కాకున్నన్ జెడువృత్తిలోదిగి కడుంగంకోష్ఠమై గర్భ దా
సీకాముండయి బ్రాహ్మణస్వహరుఁడై జీవచ్ఛవంబైన యే
కాకిన్ బూజరివాని సూఁతగొని తత్కాపట్యమున్ గానఁగా
లేకీ లేకిపనుల్ బొనర్తురకటా బాళిన్ మాలి మల్లేశ్వరా॥ 249

శా. "దేవస్థానపు రూలునున్న"వని ముందే చెప్పితిక్ పీనిదు
ర్భావంబున్ గని యొక్కొ యయ్యది యెటో బల్ మిత్తిగామారి రే
పేవీనిక్ గబళింప నున్నదఁట ? నీకేమీఁద దీపాది స
ద్భావం బబ్బఁగవచ్చునంచు మదిలో భావింతు మల్లేశ్వరా॥ 250

శా. దేవస్థానపురూలు సెందులకయా ? దేవేశ ! నీవీ చెడుం
దోవల్ద్రొక్కెడి నీచ సర్పకుని దుర్దోషమ్ము సర్వమ్ము నీ
భావంబందు నెఱింగి యుంటివిగదా ! పండ్లూడఁగాఁదన్ను చో
నేవంపుం బనులాఁగితిన్నఁ బడఁడే ? యీకూళ మల్లేశ్వరా॥ 251

శా. విప్రస్వాపహృతిం బొనర్చెను గదా ! వీఁ, డిట్టిదుర్మార్గుఁ డీ
యప్రాశ్యున్ జడు శిక్షచేసితివె ? యన్యాయమ్ముపేక్షింతువే.?
"విప్రస్వం విషముచ్యతే" యనునుడిన్ వెఱ్ఱుల్ పరిసంగించిరే ?
క్షిప్రంబీ చెడుగున్ హరించి నుడి వాసిన్నిల్పు మల్లేశ్వరా॥ 252

మ. తనమిత్రుండగు నీదు లెంక ద్విజవిత్తమ్మున్ హరించెంగదా ?
యని మా కుంకయు నట్టి పున్నెమునకై ధ్యానించి తావెట్టి బా
పని సాధ్విన్ విధవన్ స్వశక్తినెటులో వంచించె నీ యుర్వరన్
గనుమయ్యా ? యనలాక్ష ? కన్ దెఱచి వేగంజాఁగ మల్లేశ్వరా॥ 253

శా. నేఁ దిన్నట్టి పదార్థ మర్చకున కెందేభోజ్యమౌనంచు నీ
వాదం బొక్కొ ? భుజించితీవు విసమున్ భర్జించె బ్రహ్మాస్వ పుం
జేదున్ మెక్కితివొక్కొ ? యియ్యది యెటుంజీర్ణింప దల్లంతటన్
బోదామూలము శుద్ధిచేసి విడుచున్ బో ? చూడు మల్లేశ్వరా॥ 254

శా. గోవుల్ పూజ్యములంచు రౌగవ ! మహాకాత్రిరాత్మకుల్ పీంత్రు చ
ర్మా వేశమ్మునఁజేసి మామక గవిన్ వ్యాజమ్మెవో పొల్పుచుణా
భావిస్వీయగతి వ్రిబోధముగా బాధించి నోరెండి వా
పోవన్ జేసిరి చేటుకాల మిదియేపో ? చూడు మల్లేశ్వరా॥ 255

శా. చేటుంగాలమెకాకయున్న వృథగాఁ జియ్యెక్కి చండాల పుం
గోటిన్ మెక్కి బహిష్కరింపఁ బడి సద్గుర్వాగ్రహాగ్నిస్ఫుట
ద్వాటిన్ గ్రమగ్గెడి దుష్ప్రియత్నములుసల్పంగాఁ బనేమయ్య ? నీ
నోటంబల్కుము హేతువున్న విని సంతోషింతు మల్లేశ్వరా॥ 256

మ. పరమాపాత్రులవల్ల గ్రామము వృథాపాడౌచునుండంగ నీ
పరకే యెంచు కుపేక్షచేసెదవా ? దేవా ? సుంతవాకొమ్ము సం
సరణఁబెట్టులొయీఁది కొంచుసు దురాశాదూషితుల్ కాని స
చ్చరితుల్ వీరల గోల కోర్వగలరే ? చర్చింపు మల్లేశ్వరా॥ 257

శా. దాసీరండకుఁ గొంపఁ గట్టుటకునై తానీదు పూజారి ని
శ్శ్వాసమ్ముల్ బిగఁబట్టి తప్పుసుడులన్ సంతానవంతున్ మర
ధ్యాసం బెందును లేని గేస్తునెటులో వంచించి యన్యాయపున్
దాసున్ జేసి మదాగ్రహాగ్నిదరికిన్ రప్పించె మల్లేశ్వరా॥ 258

మ. చెడుబోధల్ బొనరించుఁ గాక యలదాసీభర్త, సుపూర్తిగాఁ
జెడియేయుండె స్వయంకృతాఘములచే శేషంబు మహాపహ

స్నుడులం దీరెడిఁ గాక. నేస్తితఁడు మందుండౌచు మద్భావవృన్
బడవాగ్నిం బడవెంప నేమిటి కయా భావింపు మల్లేశ్వరా॥ 259

శా. పిల్లల్ తెల్లలు బోలెఁడుండి రెటులో జీవయ్యె సంసారమున్
దల్లన్నెట్టుచునుండె బంధుగులలోఁ జాలన్ వలన్ వంపు సం
ధిల్లన్ వంశము పొల్లుగాఁ మదకు నంతే వాసులున్ మోరపైఁ
జల్లన్ దానెటులీ గృహస్థు చెడు కర్జంబూని మల్లేశ్వరా॥ 260

మ. ఇసిరో? యే మొగమౌచు బంధుగులమో మీతండు వీక్షించునో?
పసివాడో? పసరంబో? లేకునికిఁ బాషాణమో? కాదు మా
నిసియై సత్కవిచేతి సొమ్ముఁ గొని దుర్నీతిన్ బ్రవేశించి యె
ప్లు సురల్ వాయకనిల్చి యుండఁగలఁడొక్కో? మీఁడు మల్లేశ్వరా 261

౭. అన్నమ్మున్నను లేకయున్న మనుపే యన్యాయపుం గల్పనల్
పన్నన్నేర్చిన దుర్భగుల్ జనులలోఁ బ్రాదుర్భవంబందరి
ష్టన్నన్ జెన్నఁటి మూఁక పెచ్చుపెరిగెన్ హా? గ్రామమల్లాడి యే
తెన్నుంగానక నిన్నుఁదూలెడిఁ జుమీ! దేవేశ మల్లేశ్వరా॥ 262

పపటన్ జూచినఁ గూట సాక్షిగణ మొందీక్షించినన్ దుర్మద
ప్రచురాహంకృతు, లెందు గన్గొనిన మద్యారంభు, లంచారమున్
సుచరిత్రద్విషు లెందుఁ గన్న గరుణాహీనాత్ములై గ్రామమే
పుచెడన్ గేస్తులెటుల్ వసింతురిచటన్ భూతేశ మల్లేశ్వరా॥ 263

నోటం బుస్తులురాలు కాఁతలనుమందుండౌచు మాకుంకయే
లోటున్ లేనిమహాత్ములం గుణిపి పేర్లున్ బ్రోలఁగాఁ జేయు బల్
పేటెత్తెంబుమి పీనిపోతరము స్వల్పీయమ్మనం జోలను
బ్బాటింపన్ దటియయ్యె నేమిటి కుపేక్షబుద్ధి మల్లేశ్వరా॥ 264

పతితుండౌ నలహాచ కాఘముఁడు సంభాషించు నాయాయసం
గతపుంగాతలు వింటివేకద? తదాకారమ్ముఁ దద్దోషపున్
గతులు న్నిన్ని వెలుఁగంగ నేరవెఁ బలాత్కారమ్ము నావావిగా
హుతిగా నీయనలాక్షి కై కొనదదేమో? తెల్పు మల్లేశ్వరా॥ 265

శా. నీయాలెంకయు మాదు కుంకయును వానిం సుక్షగాఁ జేసి మే
ష్యే యున్నారము పైసఁగూడు" మనసాయీ సారమేయుండు స్వ
ల్పాయుష్కత్వము కల్మిఁగూనెడిని దుర్వ్యాహారముల్ వినికే
ప్రాయశ్చిత్తము చేసెనో? యెఱిఁగి సంభాళింపు మల్లేశ్వరా॥ 266

శా. కేలన్ దర్భలు మ్రోల నువ్వులును జక్కన్ మూటనోటన్ మహో
ద్వేలంబౌ పొగచుట్ట ధూమము పయిన్ వ్రేలంగఁ బౌరోహితిన్
గ్రాలున్ వీఁ "డదికూడ" దంటిఁ గనిసేఁ గాలాను కూల్యమ్ము తే
కోలిన్నాఁ డొదిగెన్ గడున్ మిగిలె నేఁడో? రేఁగి మల్లేశ్వరా॥ 267

మ. తగు శూద్రుల్ గల గ్రామమే యసనెతం దద్ద్వేషిరిస్ గాంచి "యీ
నగుఁబాటున్న డకేఁడు సీకుఁ గలపె న్మాయింటికిన్ రాకు నీ
తెగుఁలెతే ముదిరెంజుమీ" యనుచునే ధీమంతుఁడో మోరవా
యఁగఁ దిట్టుంగద? యట్లుగామి నిటువీఁడల్లాడు మల్లేశ్వరా॥ 268

మ. "మనజాతిం గల దోషమున్ మనమె సంభాళించుకో యుక్త" మం
చును నేనించుక మందలింప నది యీశుంతన్నకున్ ద్వేషముం
బెనచెన్ మున్ దఱిగామి నోరుడిగి మాపేర్తిన్న లిప్తాఁత గా
నను వీఁడూరక తిట్టు వింటివికదా? నాసామి మల్లేశ్వరా॥ 269

మ. కలికేలాటి యథాస్యలుండు మె యహంకారవ్రతం బెంచితో?
యలతి స్వ్రీచు జడున్ గణించుడవి సర్వాసుప్యుంబెంచితో
పలుకుంగాక చెడున్ దనంతటనె యీకుంకంచు లోనెంచితో?
తెలియన్ జాల భవన్మనోగతము నోదేవేశ మల్లేశ్వరా॥ 270

మ. పలుగన్ గాడిద యర్చకుండితఁడు దీపమ్మని నాకంచులో
సలుకన్ బూని మహాత్మచోఁ జనుట నిందావంతయున్ నాదుస
త్కళలేకున్కిన రణ్యరోదనము త్వత్పాదవ్యాప్తం బంతువో?
శిల శేషించెఁగదా? యదేయఁదుచు నీచేపెల్ల మల్లేశ్వరా॥ 271

మ. మును బెల్లమ్మును వండినట్టి పొయిపమ్ముంగాని చందానసీ
పసయమ్మున్ వసియుంచినట్టి శిలయున్ వ్యర్థమ్ముగాఁ బోవవో

యనఘా? యిట్టిదె భూతపూర్వ పరిభాషార్థంబు తోడౌను జ
య్యాన నీమంతగుణల్ హరింపుమిఁక మాంద్యమ్మెల్ల మల్లేశ్వరా॥ 272

మ. స్థల మెవ్వానిది యేని స్వీయమనియే తాత్పర్యమౌ వీండ్రికే
పొలమేనిన్ దమదేయటంచు మదిలోఁ బుట్టున్ పురాశాభరం
బిలనీలాటి దురాత్ములున్నయెడ గేస్తైలాను వాఁగాఁపురం
జెలమిన్ జేయగఁ లాఁడు? కోర్టొకటి దిక్కై మాకు మల్లేశ్వరా॥ 273

శా. ఉండెన్ గోర్టను కొందమీజడులకే యుచ్ఛృత్వ నీవత్వపున్
గొండాటమ్ములు లేమి నయ్యెడల బొంకుల్ బొంకి తన్నేతవే
దండింపం బడకెట్లొ తప్పికొనుచే తత్త్వమ్ము కాదేని యీ
బండల్ శిక్షితులయ్యు మానవు దురభ్యాసమ్ము మల్లేశ్వరా॥ 274

శా. నాపై పెంద్రొకతప్పుఁ నేసిడిరిమున్ న్యాయంబె చేకూఱె నం
దీపావుల్ చెడిపోయియున్ మరల నాయీపాశశాలా గృహం
బూఁపన్ జొచ్చిరి వొద్దికష్టపడ యీ యుచ్ఛిష్టులన్ దోఁగో
ర్టైపాటిం బనిసే యపిమ్మోదల నీవేకోర్టు మల్లేశ్వరా॥ 275

మ. "ఇలమొండిన్ మగఁదేమి సేసెడిఁ" దర్పాహీనుఁ శివ్వుందేమి దా
సలుపున్, నావినియుంటినా మెత్త భవద్భ్రాంతి ప్రాకారమ్ము మా
ఖలు నిర్లజ్జత దానికిన్ మిగులఁ దార్ఢ్యమ్ముగాఁ జేఁచె న
ర్గలితున్స్వని నుపేక్షసేయుట యనర్థంబయ్యె మల్లేశ్వరా॥ 276

శా. ఏమాత్రమ్మును సిగ్గు లేనిదని మా యీగ్రామ మిప్పటితో
నే మాటెనియుఁ జెప్పఁగొంకెడిని పాపీ హేతు వేమాపెవో
స్వామీ? దీనికి బుద్ధివచ్చుటెటులో వాక్రుచ్చు రాకున్నచో
నేమన్నా గృహమేధి వర్గమున వేఁడీవారి మల్లేశ్వరా॥ 277

శా. నీవాక్కుండదె శక్తియుండియును నీనిం గోర్టు చెప్పించుమిన్
జూ? పిండిట్టుయి నీవయున్ దయతో "నీయం" దంచు లోనెంచి పిఁ
డేవెంటన్ జనినన్ బహింపుటది నీ చేతప్పు నా గొప్పితిన్
దేవా? నామనవాలకింపు మటువేసం బెత్తి మల్లేశ్వరా॥ 278

శా. ఊహుం బేరును లేనిశుంఠఁ బరమాయోగ్యున్ జడున్ వీనినేఁ
గారాగారము సేప్పు పొంచెఁగడకున్ గక్షమ్ము సందున్ రితా
ర్థారన్ బెట్టుక కోర్టు కెక్కునెడ మర్యాదాపరుల్ సూచి "సీ
సీ" రావమ్ము లొనర్తు" రంచు మదిలోఁ జింతింతు మల్లేశ్వరా॥ 279

మ. అయయో? నిత్యము గంగరావులె గృహంబై వంటపూటిండుచే
శయ నీయస్థలు లన్న శాలలును నైసాక్ష్యంబె కూడా దురా
శయుఁడేమేని యొనర్చుఁగాక తనకున్ శాంతంబె కర్తవ్య మం
చు యశోర్థుల్ విధియుంతురంచు మదిఁదోఁచున్నాకు మల్లేశ్వరా॥

శా. కాదే నిన్నసుఁగూర్చి వీఁడు చెడుగుంగర్జమ్ములం జేసినన్
వామన్ వైచినఁ జేదుమేసినను దుర్వ్యాహారముల్ గిల్కినన్
బోదెన్ బాడ్చిన నేమిచేసిన "సదేపోని" మ్మటంచేను ము
ద్దామన్ వీనిక్షమింతునే? యదఁపనే వైరమ్ము మల్లేశ్వరా॥ 281

శా. పేఁగోర్టెక్కుట యొక్కటే కడమకాని యెక్కుచో వెంటనే
యీ గర్వాంధుని బాడ్చివైచుఁ బ్రుటిలోనే కోర్టు దుర్వాదముల్
సాగంబోవటి "పిఁడపాత్రుఁ" డని నిచ్చల్ గోర్టెయుంగుంబూమి?
నాగంభీరత నీవెఱుంగుమదియే నాకోర్కి మల్లేశ్వరా॥ 282

మ. అకలంకుండగు బ్రహ్మశిష్యునొకనిన్ వ్యాజమ్మె దోషాల్పి యీ
సకలంకుండును వీనితమ్ములును నిచ్చల్ గొట్టఁగా నేఁడు పూ
నికమైయుండిరి యిప్పుడేనియు మది న్నీవీదురాచారులన్
బెకలింతో? యికిలింతొ? వీండ్రివౌసఁగుల్ ప్రేమించి మల్లేశ్వరా॥283

శా. ఆవిద్యార్థికి దిక్కునేనుగద? నాకన్నన్ మఱిన్నీవు, నీ
తో విజ్ఞాపనసేయుచుంటి, నెటులో దుర్మార్గులం దోలు మ
య్యా! వేలుండును నీకుఁగర్జములు రేపంచేననన్ గాని యో
దేవా? యందిది ముఖ్యకార్యమని నిర్దేశింతు మల్లేశ్వరా॥ 284

శా. "గోప్యక్షా గర్భిణిఁ గట్టిపెట్టుటది యీగోపాలు మీచేత స
ద్భావుల్ మెచ్చరటంచు ఘాతుకీఁడనుటల్ తప్పంట? నేనింక తా

ధీవృద్ధున్ వెస మందలింపనియెడన్ దేజమ్ము మాపింపకం
టీవిద్దూర మెఱుంగుమయ్య ? పయినింకేమైన మల్లేశ్వరా 285

శా. నన్నున్ లోఁగఁగఁజేసి సంకరపుటస్త్రంబున్ దిసన్ జేయఁగా
నెన్నోపాటుల కగ్గమైతునకు నాయిల్లంటు వొడ్డిన్ గానఁ
గన్నిన్నన్ యత్నముచేసి నేఁగానినపైఁ గాలంపులోఁ బెట్టి యా
కన్నుల్ గానని చేష్టలన్ పయిపుటన్ గర్హించె మల్లేశ్వరా॥ 286

శా. నాతోడన్ గలహించుటే తమకు నానందప్రదంబంట ? నే
నీతుప్పాత్ములతోడ నేమొగముతోహ్రీ వీడివాదింతు ? నే
బూతుంబుంగలతోడనే మని గృహంబుంజూచి కూర్చున్న నీ
పేర్తిక్ కౌతరుఁగాఁ దలంచి మఱియున్ వేఁగైఁ మల్లేశ్వరా 287

మ. "వెనుకన్నాయియు ముందుగోయియుఁ,, గదా? విశ్వేశ? నీవింపులోఁ
బనిసేయన్ వలె వింత్రడంగవలె, నాపాండిత్య మిప్పట్లనెం
దనకుం దాఁ గొఱగాదు, మంచపల దుర్దోహమ్ములన్ మాన్పనే
ర్పను నీకే వివరింపఁగా వలయునే ? భూతేశ మల్లేశ్వరా॥ 288

మ. అనయమ్మున్ దనచేయు టుండగము లాద్యంతమ్ము నీతోడ నే
మనవిన్ సల్పుటకూడఁగూడ" దఁట ? నామాటీవు మన్నింప వం
టెనుఁ బోతీగతి మాపరిప్రియ డనెడిన్ హేలాగతిన్ గారణం
బును గూడన్ వచియించె వింటివిగదా ? మూర్ఖుండు మల్లేశ్వరా॥289

మ. "వెలిలోనుంటి" వటన్న హేతువుననిన్ విశ్వేశ ? పూజింప క
వ్వలనెందోకల నీమలింగమును సంభావించి నానంట? యా
స్ఖలనవ్యాజము గారణమ్ముగ భవత్స్వాంతమ్ము నావిన్నప
మ్ముల నాలింప,,దటంచు వాకొనెడిఁజూ? మూర్ఖుండు మల్లేశ్వరా॥290

మ. ఇటులుప్పొంగునెకాని "యీయఘముతోనే" మంచు నీపూజకుం
డుట, నేనట్లుతె దోషియౌతనకుఁ గోర్తున్ జూపకే మిన్నకుం
డుట, భావింపఁ, దశక్తిహేతువుగ రెండుంగూడ లోనెంచు దూ
రటనంబున్ బచరించు వీనిమదగర్వంబూడ్చు మల్లేశ్వరా॥ 291

శా. కొంప న్నిప్పిడుపొక్కతే కడమనాఁ గూళల్ మరంభముల్
పెంపున్ దెంపునులేక నల్పుచుఁ గడున్ బేపెత్తి యున్నారు నీ
జుంపెందున్ దెగఁదెంపులేనిగతినా సాగించుచున్నావు నీ
మంపున్ దింపుటకే కవిత్వమిది సాంబా? దేవ? మల్లేశ్వరా॥ 292

శా. శాపంబేనియుఁ జేయఁజాలని మహాశంకోష్ఠపుం బీస్నులే
యేచండాలమునేని మెక్కుదురుగా కేనెట్లు భక్షింతు నీ
నీచున్ దానికి నాపయిన్ దెగుటకున్నేవంచురన్గాని, నీ
చూచీచూరమికేను జింతిలెదనో శుద్ధాత్మ? మల్లేశ్వరా॥ 293

శా. మొండిన్ భూపునికన్న గండనిగఁ జెప్పున్ లోకముల్ వానినె
వ్వండాఁగంగల డంటివేని నిజమే ఫాలాక్ష? నీచూపురా
కుండెన్గాని తదగ్రిమంమున దురుద్యుక్తిన్ బ్రిసక్తించునే
మొండుల్ నిల్తురు బండలుండెవడు? పమ్ముంగాక మల్లేశ్వరా॥ 294

మ. "ఇటుపై శాస్త్రులవారి జోలికొగఁ బోనేపోము తప్పొక్కటి
ప్పటికేజా నైపుఁ" డటంచుబ్రి వెంబడిగనే బండాటకారంభమే
మిటఁ జక్కంబడఁబోయెరీ జడులు? సామీ? నీమహోత్కృష్ట దు
ష్టట నిర్ధూమదృగగ్నిరుష్టులఁ దక్కన్ దెల్పు మల్లేశ్వరా॥ 295

మ. అపవిత్రాన్నము మెక్కనేల? "యదిహేయం" బన్నమాత్రాన న
న్నపరోధింపఁగనేల? మత్కవన విద్యోపాస్తికిన్ బొక్కనేఁ
దపలాపమ్ములుగూసి దుర్గతికె దాపైమ్రగ్గఁగానేల? య
గ్గిపయిందూఁకెడి పుర్వులట్లు యిదివో? గీడన్న మల్లేశ్వరా॥ 296

[illegible]. గుసుపున్ దిట్టిన, గ్రామపాపకుసిచే గుర్వగ్రి మందేహాతం
బొరిధూమమ్మెగయఁగఁ బుట్టలనిశమ్మున్ నాల్పఁగాఁ జేసినన్
సరిహద్దుంగాని వానిగోవులకు నిచ్చల్ కస్తి గప్పించినన్
బరమామేధ్యముదిన్న పాపము శమింపంబోదు మల్లేశ్వరా॥ 297

మ. ఏమఁదీయన్నము సెచ్చెనో? తమకు వాఁడే దాపసే వానితోఁ
దప్పుపై యాతెవులాఁది బొందఁజుడు నీవద్దమ్మతే దాపసి

పొవయంబోతగు గ్రామపాచకుఁడు ముమ్మందే వెరంజావనీ
యవమానాన్నముదిన్న యీవొసఁగు ఘోదారార ! మల్లేశ్వరా॥ 298

శా. ప్రాయశ్చిత్త మొకింతచేసుక యెటోపంక్తిన్ బడఁగారాదె? యీ
చేయన్రాని యకార్యముల్ సలిపి ? "సీ సీ" పొందఁగానేల? యీ
కాయన్రాని యవాచ్యముల్ పలికి గగ్గోల్పాలుగానేల ? యి
ట్లాయాసంపడి పంక్తికర్హతను వీండ్రా? గొండ్రు మల్లేశ్వరా 299

మ. పరమాపాత్రులతో విరోధమది సంభావ్యంబు గావన్నచోఁ
బరమాపాత్రులతోడి మైత్రియును సంభావ్యంబు గాకుండుఁగా?
పరిశీలింపఁగఁ బాండ్రమిత్రుఁడను సౌభాగ్యమ్ము కన్నన్గనున్
మెఱుఁగౌ పాండ్రకితండు శత్రువను చే మేలెంచు మల్లేశ్వరా॥ 300

శా. ఈయుచ్ఛిష్టులతోడనేమని జవాబేయాక నుంతెప్పుడే
నీయిత్తున్, యచితప్పునన్నమున నాయీవెంటనే, యేటికో
క్కో ? యీశాన? యిటొట నీయెకఁవలో నూహింపుమేనో? యపాం
క్తేయాభాషణ దోషహేతువుగ నిర్దేశింతు మల్లేశ్వరా॥ 301

శా. లేరంచున్ బలుకన్ దుసువ్యములు దుర్లేపుల్ జగమ్మంచు మా
కాఱుందున్నలవంటి దుర్ముఖులు ప్రాక్కాలమ్మునన్ లేరయీ
చారాచారులు నోరువిప్పుటమొదల్ సత్యోక్తి మారమ్ముగా
గాఱున్నాలుక, వీండ్రదెట్టిదొకదా ? జన్మంబు మల్లేశ్వరా॥ 302

శా. నోచన్మ్యుల్ పలుమందిలో నొకఁడెటో యుంతన్నయానేని మన
ర్వ్యాపాసక్తుఁడు వేజొకండగుబ సర్వత్రానుభూతమ్మగున్
మా మర్జాతుల పుట్టువెట్టిదియొ ? సామాన్యమ్ముగా నెల్లరున్
నోచన్మ్యుల్ సమశీలురై రిదిగవా ? చోద్యమ్ము మల్లేశ్వరా॥ 303

శా. మూఁడేదుల్ చనవచ్చె సీకలహముల్ మోసెత్తినాఁడావినన్
గాదన్ గూసెడికూఁత లేమిచెడుగుం గర్జమ్ముతే మేను నీ
తోడంజెప్పుచునుంటెకాని, ప్రతియెందుంజేయఁగాఁ బూన, నీ
పీడల్ నీచెవికంటపేమొ ? యని యుత్ప్రేక్షింతు మల్లేశ్వరా 304

శా. మేమే కూటిని మెక్కి యిక్కరిణి భస్మీభూతమై పంక్తికిన్
గ్రామమ్మందు బహిష్కరింపఁబడి దూరమ్మైతిమో? యీపయిన్
బో మా జోలికిఁ జేర్చికొ'' మ్మనెదరో భూతేశ? మున్ మెక్క నా
యామాలిన్యము నూడ్చ నెయ్యదియొ ప్రాయశ్చిత్తి మల్లేశ్వరా॥ 318

శా. ఈ యుచ్ఛిష్టన కుచ్ఛనీచతలు లేనేలేమి హ్రీ వీడి గో
మాయుప్రజ్ఞ శరణ్యమై మెలగెడిన్ మాయావియోపీనిమా
తే యెవ్వాఁడు పనండ, యందులకు నేనే హేతు వం చే యస
ప్రేయుం దేడియొ నామెతన్ సలిపెడిన్ జీకాకు మల్లేశ్వరా॥ 319

శా. ఈ మా కుంకనకన్నసేదయినలెంకే కొంత యోగ్యుండు, వీఁ
డే మాత్రమ్మో పురోహితార్థమున ము న్నిచ్చెన్ ధరన్, దాని ని
ష్టీ మా తుచ్ఛుఁడు లాగికొ మ్మనిన వీఁ డీకొన్నటుల్ వే దయో
సామీ? దీనినిఁబట్టి య ట్లొరిగె నా స్వాంతమ్ము మల్లేశ్వరా॥ 320

శా. నాచే "మీ" రనిపించుకొన్నఁ దనకున్ వాటిల్లుఁ జావంచు భీ
ప్రాచుర్యంబు వెలార్చి వెంబడిగ నన్ బల్ కాఱులన్ గూయు మా
నీచుం, డియ్యదిమాత్ర మాయువు గడున్ దీర్ఘమ్ముగాఁ బెంచునే?
యీ చండాలు ప్రవృత్తి కర్థ మది లేనేలేదు మల్లేశ్వరా॥ 321

శా. "ఏ పాపాత్మకు నైన మోసెదనుగానీ మోయఁగాఁజాల శు
ద్ధాపాత్రుం డగుటన్ బుతేతరవచోవ్యాహర్తనం బాడదే ?
భూపద్మాసన తొల్లి తావ్రఘుని మా మూర్ఖాత్ము నె ట్లిప్డు దాఁ
బాపం బాపె భరించుచున్నదొ? మహాభారంబు మల్లేశ్వరా॥ 322

శా. శాపం బిచ్చె నిషాదిపీరలకు బిచ్చం బడ్గి దండాహతిన్
గోపింపంబడి రోదనంబునఁగడున్ గూపెట్టుచున్; మానమే
చూపెన్ బోయత తా నటన్ వ్యవధి; యిచ్చో నైన సత్యంబు సం
స్థాపింపన్ బ్రయతించి సాయపడు మో సర్వేశ మల్లేశ్వరా॥ 323

మ. క్రమదూరుం డయి మాదు కుంకన ననున్ గారించినన్ "వాఁడె పో
సమసెన్ వాన'' నటంచు నేను మిగులన్ శాంతుండ నై యుంటి మా

సముగూడన్ జన తేర వీఁ డఁడఁగె దృష్టాంతమ్ము "కాఁడిగ్గ కా
ర్యము గంధర్వులుతీర్చి" రంట కిదియే యౌనొక్కొ? మల్లేశ్వరా॥ 324

శా. సుబ్బారాయని షష్ఠినాఁడు మన యీ శుంఠన్న కెక్కెట్టులో
దెబ్బల్ తప్పెనుఁ దిట్లతోఁ దెమలె, నీ దీనుండు సోదర్యులన్
దబ్బిబ్బై యిలు సేరి రింక నయినన్ ధార్ష్ట్యమ్ములన్ మాని మే
లబ్బన్ వర్తిలున ట్లొనర్పఁ దగుఁగాదా? నీకు మల్లేశ్వరా॥ 325

శా. చావే కొండొకమంచి నాఁ డగిన వైద్యం బెట్లు నాఁ దండియున్
జీవం బుండియు లేనియట్లు లగుటన్ జీవచ్ఛవం బౌచు దు
ర్వ్యాపత్ సోదరు లాఁతగాఁగ నిలు సేరన్ గత్తె శుంఠన్న నీ
వేమందీతి ఘటించి తంచు మదిలో నే నెంతు మల్లేశ్వరా॥ 326

మ. పొగరుంబోతుతనానకున్ ఫలము సంపూర్ణమ్ముగాఁ గాంచియున్
బొగరున్ మానఁడ వింత పెంచియును దప్పుం దోవరే త్రొక్కుచున్
దెగనీల్గున్ గడు విఱ్ఱవీఁగుఁ దెగడున్ ధీమంతులన్ వీని కీ
తెగు లూడంగల పాచిత మ్మొకటి నిర్దేశింపు మల్లేశ్వరా॥ 327

శా. చాలున్ బాచిత మింతతో నని మదిన్ జర్చించి నాఁడంతతో
నీ లుంటాకు ననుగ్రహించితివొ? నీ వెంతేని సర్వజ్ఞతం
గ్రాలన్ జాలిన వేల్పవయ్యు నిటు లజ్ఞత్వమ్మునం బ్రింగి తో
ఫాలాక్షా? కను విప్పి చూడు మరలన్ బ్రిభ్రష్టు మల్లేశ్వరా॥ 328

మ. పరమాపాత్రుఁడు గ్రామపావకుఁడు తప్పొక్కొమ్మునందే పొరిం
బొరి నా పంచమహాఘముల్ స్థిరగృహమ్ముం గట్టి పేర్చెన్ మఱిం
టరి నీ వెంటయు మాడు కుంకయును నీ టాపోటు వాదూటు కిం
కరు లై కయ్యము సేయ సందెపడు శంకల్ వచ్చె మల్లేశ్వరా॥ 329

మ. అరయన్ గయ్యపు కూత పచ్చపయు నీవాత్సంత నీదాత్మలో
దురితంపుం బెనుపాపుగట్టి యగు శత్రువ్రాతపుంబట్ల నె
వ్వరికిం గూడ శమేచ్ఛవర్తను మహాపాతుక్ము నీ పాపకున్
బరిమార్పంగదవయ్య? గ్రామశుభమున్ వాంఛించి మల్లేశ్వరా॥ 330

శా. ఈ మధ్యాహ్నపు మాలబ్రాహ్మణశవమ్మే యొందు లేకున్నచో
వేమాత్రిమ్మొ భవత్సపర్యయెడఁ దాసే లెంక వర్తించెడిన్
సామీ ? వీఁడొక సత్రికాయగఁ దనున్ జాల్మొండు సేవించుటన్
దీ మో మెన్నఁడొ కాని చూడఁడు సుమీ?నీ లెంక మల్లేశ్వరా॥ 331

శా. ఈ చండాలుని కారణమ్మనసె యా యీ గ్రామ మిక్కట్లచేఁ
బ్రాచీనోన్నతిఁ గోలుపోయి చెడియెన్ బాపస్వరూపుండు వీఁ
డో చండీశ్వర ? నీకుఁదా నిడెడి నయ్యో ? నిత్యనైవేద్య మ
ప్పేచీకోరు భవత్పదార్చకుఁ డొగిన్ బెట్టింప మల్లేశ్వరా॥ 332

శా॥ ఆ కంకోష్ఠుఁడు కోర్టులన్ దిరుగు దీ యపాత్రిష్యచే నీ కెట్లో
"కాక" శ్లోకపుకన్నమున్ గుడిపెడిన్ గారుణ్యమో ? యేమొ? నీ
పై కక్షారితికూడె మెక్కెచవు నీ కాద్యంతముల్ వీని దు
ష్పాకం బే నెఱిఁగించి యేమి ఫల మో సర్వజ్ఞ మల్లేశ్వరా॥ 333

శా. స్వైరిణ్యగ్రణి కారణమ్ము నఁగదా ? చండాలమై గ్రామపున్
గారా పెల్లను బొల్లుగాఁదొడఁగె నీ కంకోష్ఠుఁడే దానికిన్
డాపంబై పెదతల్లియిల్లు చెరిచెన్ జాల్మం డటం చెంచ కి
చ్చోచెదున్ జేర్చెను గొంప కాపెపతి చిచ్చుంబోలె మల్లేశ్వరా॥ 334

మ. ఇలు వేరెన్ మఱి యింటనే కుడిచెఁ బైనిల్లాలిఁ జేరెన్ గడున్
ఖలుఁడై యింటికె యూఙమాన్యపదవిన్ గైసేసె నెన్నేడులో
మెలఁగెన్ దగ్ధగృహమంచ దుర్భగుఁడు సామీ?యామెకున్ దాసుఁడై
నలిపెన్ వంటయునీళ్ళమోఁతయు మొదల్సర్వమ్ము మల్లేశ్వరా॥335

మ. పయి నాస్వైరిణి పీనికన్మొఱఁగి "నాన్ బ్రామిన్స్" తోఁబొత్తొగిన్
గయికోఁ జొచ్చెను పేఁడు సక్కతన దుఃఖం బంది యెట్లేని యా
ప్రియురాలిన్ బెడఁ బాపి ద్రవ్యమిడి తాఁబెండ్లాడి గే స్తయ్యె దు
ర్నయుఁడిట్టిం డని నీ వెఱింగి గుడికిన్ రానిత్తె మల్లేశ్వరా॥ 336

మ. అనయం బెప్పుడుఁ "దొత్తు క్రిందపడు తొత్తై" నీదులెంకన్ గడున్
వినఁట మ్మొప్పఁగఁ గొల్చువీని నొగి నైవేద్యానకున్ జూపి యా

జననింద్యం బనిశమ్ముఁ గోర్తుకడనే చచ్చున్ సమస్తమ్ము నీ
మనమే దీని నెఱుఁగు నీ ఖలు నెటో మాయింపు మల్లేశ్వరా॥ 337

శా. స్నానం బాడగ నేటిలో దిగియు మానక్, లేఁడుతాఁ జుట్టకా
ల్పీ నిర్భాగ్యుఁడు వీని నర్చనకు నీ వేలాగు హర్షించితో?
"పోనీ! లెంకయు నిట్టిఁడే యగుఁగదా? పోరాటమే" లందువా?
ఈ నీచాత్మునికన్న వాఁడె మెఱుఁగౌ నెంచంగ మల్లేశ్వరా॥ 338

శా. వాఁడున్ వావియు పత్తనంబుడిగియే వర్తించు వీఁ డట్టిఁడే
వాఁడున్ జుట్టలు గుప్పతెప్పలుగఁ గాల్చున్ మిన్న వీఁ డట్టిఁడే
వ్రీడాలేశము వానికిం గలదు నిర్వీతుండు వీఁ డిట్టి యీ
జాడన్ దెల్పితి నీకు నింక నయినన్ జాజూఁడు మల్లేశ్వరా॥ 339

మ. కడు దుర్మార్గులు పెం డ్రొనర్చుచెడుగుల్ గాంచంగలేకేను నీ
యడుగుల్ మ్రొక్కి విధేయభావమున నభ్యర్థించుచే కాని నీ
యెడఁదన్ సుంతయు నామొఱల్ నిలిపినట్లే తోఁప దయ్యయ్యొ? యీ
చిడుముల్ పోయెడిపోక లాఁగవు గదా శ్రీకంఠ మల్లేశ్వరా॥ 340

మ. నిజ మిన్నాళ్ళ కెఱుంగ నయ్యె నథవా? నీతోడ నేఁజెప్పితిన్
భజనాగారము మాలపల్లెగఁ గులభ్రష్టుండు మా కుంక యా
రజ మాఱంగ రచించె నంచుఁ గట? యా రాండేయు నా దుష్టనా
కుజనున్ శిక్షితుఁ జేయవైతి విది నీకుం జెల్లె మల్లేశ్వరా॥ 341

మ. శ్వపచుల్ సైతము "దైవ" మంచు నొకచో సద్మమ్ము నేర్పర్చి యం
దపవిత్రింపుగతిన్ బ్రివర్తిలుటకై యత్యంతమున్ జంకదుర్
గృపణాగ్ర్యుం డగు మామ కుంక కెడఁదన్ గోరంతయున్ జంకతే
మపమాతీతుఁడు వీఁడు నాదు మొఱ నీకో? రాదు మల్లేశ్వరా॥ 342

మ. వ్యవసాయ మ్మొనరించు జీవికకునై యద్దానిచే వీధి పా
డవునే? రాముని యాలయమ్ము పశునిత్యస్థానమై మాలవాం
డ్రు నివసింపం గల తావుగా నగునె? యీ రోతల్ మ తెందేని యు
న్నవియే? కన్నవియే? యిదెక్కడి మరన్యాయమ్ము మల్లేశ్వరా॥ 343

మ. సరిపో? నేర్చితి మేటిదైవమవు నీశాంతిప్రకారమ్ము ని
ర్జరులే కా దెవరేని నవ్వుదురు దుశ్చారిత్రులన్ బెంపు సే
తురె? సన్మార్గుల కక్కట తమ్మునఁ గడున్ ద్రోహమ్ము గావింతురే?
యెఱుఁగన్నేరనివాడవా? తెలుపఁగా నే లయ్య మల్లేశ్వరా॥ 344

మ. మును తాఁ గ్రుక్కినపేనుపోలె నొకటన్ బొల్పొది బల్ పేద వ
చ్చినయట్లుండియు లెంకకుంకలు గడున్ జేయూతగా నిప్పు నన్
జెనకన్ జొచ్చెడిఁ బాపకాధముఁ డహో! శ్రీకంఠ? నీవీ జడున్
గనలేవే? యనలాక్షి విప్పి పొగ రింకన్ గ్రుంక మల్లేశ్వరా॥ 345

శా. పాపం బన్నను పాప మాయువు మహాపాపంబు రూపంబు దు
ర్లేపంబుం గాని పెద్దపెద్దలను గేలిం గొట్టు నిష్కారణం
బీ పీ: స్నై మని యెక్కొ? వీనిఁ దుర్గతిలో నింకింపకున్నావు? దు
ర్వ్యాపారం బిది నీ మనమ్మునకు సహ్యం బౌనె? మల్లేశ్వరా॥ 346

మ. శరణమ్మున్ మఱిఁ గొందరున్ దగవరుల్ కావించినార్ శాస్త్ర తుం
టరికిన్ బాపకసారమేయమునకు గాఢమ్మైన చీవాట్లతో
"నఱపుల్ మానుము చెప్పుదెబ్బలను నీ వాసించి నట్లున్న దం
తరముల్ గానక పొంగి కుంగఁబడుటల్ తప్పించు మల్లేశ్వరా॥ 347

శా. విద్యల్ నీవలనం గదా? మొదల నావిర్భూతముల్ వాసిపై
సద్యోఘాతక్రియ కాక మెల్లపుడు నిచ్చన్ నిల్చి వర్తించు న
య్యుద్యోగస్థులఁ గుంకలెంక లకటా? యుద్భాసకుం బిల్తు రీ
మాద్యత్స్వక్షత్రుల రూపు మాపు టది ధర్మం బయ్య మల్లేశ్వరా॥ 348

మ. తగు పెద్దల్ సదిమందిలో మొగ మటుల్ దగ్గమ్ము గావింప నో
రిగురన్ మోరయు వెల్లఁబాఱ శవమై యేపారి పాపుండు తా
నెగవుల్ గట్టెను గాని మా చవట లా యూ సారమేయమ్ము నో
రెగఁపంగా నుసికొల్పఁబూని రది నీ వీక్షింపు మల్లేశ్వరా॥ 349

శా. ఈ యుచ్ఛిష్టులు వీని నీచతను దా మీక్షించుచే కాని యూ
త్త్రీయు మ్మా నతినీచభావము లవ మ్మేనిక్ గనన్ జాల రే

మ. సకుటుంబమ్ముగ స్వర్గసుకోర్కి యెటులో సంభూత మౌఁగాక యీ
వికలాత్ముల్ నను హేతుభూతునిగఁ గల్పింపన్ బనే మయ్యె? యీ
రక బంధల్ మెడఁ గట్టు కేటను దిగన్రా దొక్కొ? చారాదొ? యెం
దు కటుల్ చాక యశేషగర్భాస మహ నీ దుర్బుద్ధి మల్లేశ్వరా॥ 357

మ. తృణ మన్నట్టి యభిఖ్య గల్గు జరఠస్త్రీ యీ మహాదుర్జనా
గ్రేణులన్ గాంచి "యి దేమి మీ చెడు పనుల్ కావందురే కాని బ్రా
హ్మణులే కాము తదస్మమానవులె కా దౌ నన్నవా రుండరం
కణఁగుం డీ" రని గడ్డి వెట్టె నఁట? నీ వాలింతె మల్లేశ్వరా॥ 358

మ. అవి శూద్రాంగన బ్రహ్మచారిణి మహాత్మాచార కొం కెందు లే
నిది తప్పొప్పు లెఱింగినట్టిది మఱి స్త్రీ లెంక దుశ్చేష్టలన్
వదరుం డో తల పాచకాపశదు పాపంబున్ సమస్తమ్ము తా
నెవ నీకన్నను మిన్నగా నెఱుఁగుఁ జుమ్మీ? తండ్రి? మల్లేశ్వరా॥ 359

మ. ప్రతివా "రిద్ది వినాశహేతు" వనుచున్ వాక్రుచ్చుటే కాని యీ
ప్రతి యేమాత్రము కాక పూర్తిగ ఫలారూఢమ్ము గాలే దెటుల్
వితథా లోకుల వాక్కు? లట్టులయినన్ వేదమ్ములున్ శాస్త్రముల్
వితథ గావే? గమనింపు మీవు మదిలో విశ్వేశ మల్లేశ్వరా॥ 360

మ. జనవాక్యమ్మన దైవ ముండు నను విశ్వాసమ్ము లోకమ్మునం
దనుభూత మ్మగు నేని యీ జనులఁ బ్రత్యక్షమ్మునన్ జాయునన్
జను లెల్లన్ శపియించుచుండుట భవత్స్వాంత మ్మెఱుంగుం గదా?
కని తద్వాక్యము సార్థకం బొనరుపం గారాదె? మల్లేశ్వరా॥ 361

మ. ఎకరమ్ముల్ పదియాఱు మున్న సురిఁగెన్ దృప్తుండు మాకుంకకున్
సుకరం బంటకు పీలు గాక దవుడల్ శోధింపఁగాఁ జాలు మా
రకపైరం బొకఁ డంకురించె నిది దుర్వారంబు మం ట్లెల్ల దు
ల్పక మైమైఁ జన దింత నిక్కువ మగున్ ఫాలాక్ష మల్లేశ్వరా॥ 362

శా. మాస ద్రుక్కులకల్ తెంక యొక్కఁడు కడున్ హీనుండు పాపాత్మకుం
డా గోలోలుఁడు పాచకాపశదుఁ డీ యల్పాయుష్యల్ గాంచుపుం

బాగుం గోరిన నీకు వచ్చు నవుడే పాపంబుఁ బుణ్యంబు తా
నోగున్ బాయను గాన్పు నంచును జగం బూహించు మల్లేశ్వరా॥363

మ. ఎవఁ డింటిఁ బ్రిభమమ్ము పచ్చుఁడని నీ వీక్షింతువో? యిల్లన
పవరత్వమ్మెన నేడ్గురుం బ్రిభములే ఫాలాక్ష? యట్లయిన మా
రవునిన్ బాపకు మంగళార్థము వధ పారంభమం జేర్చి యు
త్ర్పవరుల్ తిట్లైడితిల్లి కర్మమును సంపాదింప మల్లేశ్వరా॥ 364

శా. కుక్కల్నక్కలుఁ బందులున్ మఱియుఁ గాకుల్ఘూకముల్ పెక్కు లి
యిక్కన్ గాపుర ముందు నీ యభము లక్ష్మీ యుంట్రుగా నందువో?
నిక్కంబారయ మాట గాదిది పడుస్నిభాత్మునీ తుంటయున్
రుక్కల్లోనగు వారిఁ బోలఁ గల రాకో? నిన్ను మల్లేశ్వరా॥ 365

మ. ఘనకాయుల్ కడు నీచజీవములుగాఁ బుట్టుఁగా నొక్కచోఁ
బనికిన్ వచ్చుట చూచుచుందు మిఁక మాబంధుత్వనర్వాష్ఠ కో?
బనికిన్మాలినవెట్టిపీన్గులనుచున్ వాడింతు నీ మోహిఁ గా
దనుసామర్థ్యము నీకు నున్న యెడ నోరాడింపు మల్లేశ్వరా॥ 366

మ. తనయాయుస్సు క్షయించు నన్నయెడ శ్రిద్ధన్ జూపతే యున్న నం
దనుపట్లన్ సహజమ్మపట్ల నటు శ్రిద్ధన్ జూపకున్నట్టి కుం
కను మాశాభను చక్క వే జొకటఁ నేఁ గన్గోను నీ వేమియున్
గనవ ట్లొటను వెట్టిపీన్గు లని వక్కాణింతు మల్లేశ్వరా॥ 367

మ. తనకున్ నా యెడఁ గల్గు కోపమున మా దడ్డమ్ము నన్గూర్చి తా
ఘనపాపమ్ము లొనర్పఁగాక తనకున్ గగ్గోలుగా బచ్చుఁగా
కనుజుల్ గుజ్జని రేఁపి తప్పఁబను లయ్యాత్మల్పేఁ జేయఁజే
యునె తచ్ఛ్రేయము గోరువాఁ డయిన నీ వూహింపు మల్లేశ్వరా॥ 368

శా. జ్ఞాతుల్ వీనికిఁ బెక్కుమంది గల రీ పండాలు నోరోరి? దు
ర్జాతా? తప్పుడుఁ జేష్ట లొప్ప వని నిచ్చల్ మందలింపఁగఁ దా
నీతుచ్ఛుండు వినం డటం చుడిగిరేని యుక్తమే కాని చే
యూఁతై తా నునికొల్పువాఁ డొకడుఁ డిం మున్నాఁడు మల్లేశ్వరా॥369

మ. తనకుం బందికిఁ బోలె బోలెఁ దటః సంతానంబు కూ దర్కృత
మ్మనసే పూర్తిగ లేమ కష్టము సుఖమ్ముల్ జిన్నినాఁ డావిగా
ననుభూతమ్ములుగాఁగ నెత్తి పలితం బై కూడ దుర్మార్గప
ర్తన కూఁత మ్మగు నంటః యెంతటి దురంతమ్మొక్కొః మల్లేశ్వరా॥ 370

మ. తిల పూర్తి న్నరయుంగనిమ్ము తనకున్ దంతమ్ము లూడంగ ని
మ్మల మా కుంకలపాడువంశ మని తా నేనో మెటుల్ నోఁచెనోః
కలుగం డింతకు దీన నించుక వివేకంబేని యున్నట్టిఁ డీ
ఖలులన్ బెంచెద వేటికో కదఃయెఱుంగన్ జెప్పు మల్లేశ్వరా॥ 371

మ. కలుషంబై రసహీన మై వికల మై కంకోష్ఠ మై స్రుక్కుఁ గుం
కలలోనేనడపిస్తుమోర, మఱిఁ దత్కాంజాక్షి "యీ తప్పుఁ జే
ష్టలు మ" ప్పంచు వచించె నంటః వయి నా సాధ్విన్ మగం డత్త వా
వలు వేధించెద రంటః సారెకును జల్పాదించి మల్లేశ్వరా॥ 372

మ. తన కౌ ముప్పు గనంగనేరఁ డఁటః తా థా దా ధ నా గాంధ్రలో
మొనగాఁ డౌ నఁటః మోరపై నుమిసినన్ మూర్ఖత్వమున్ వీడికో
ని నికృష్టుం డఁటః కుంకః తమ్ము లనినన్ నీచత్వమందింతకున్
ఘను లౌ వాంధ్రఁటః గ్రామ మీ జనులచేఁగంపించు మల్లేశ్వరా॥ 373

మ. బలసంపన్నత నాస్తి బుద్ధిబలసంపన్నత్వమూః సున్న యీ
ఖలదుర్జాతుల కున్నదొక్కటియె దొంగల్ మిత్రముల్, వార రీ
తులపెల్ నేసెడి తప్పుకుంబనులకుం జో డౌదు రీ హేతువై
కలఁగున్ గ్రామము చింధ్రధాటి కని వక్కాణింతు మల్లేశ్వరా॥ 374

శా. వ్యాధిగ్రస్తుల పెక్కురించు చెనఁటిన్ బంగుత్వ హానత్వ మ
వ్యాధివ్యాదికదైవలోపముల నవ్వున్ బూను మర్జాతు, న
త్యాధుద్వేషిని గాల్చ కూరక యుపేక్షన్ జేయుచో నింక నీ
క్రోధాగ్న్యుద్ధతి కే స్థల మ్ముచిత ముద్ఘోషింపు మల్లేశ్వరా॥ 375

మ. ఒక విద్యార్థికిఁ బుట్టువాదిగను జూ పొక్కింతి తాఁవక్కు వా
 రికలాక్షున్ గని గ్రుడ్డి గ్రుడ్డి" యనుచున్ వేధించు పే వోసమున్

ప్రకటించున్ గదః లంజకొడ్కా పద మాపైఁ జేర్చి దూషించు పా
తకు నష్టుల్ కడు శీఘ్రకాలమున బొత్తల్ వోవె మల్లేశ్వరా॥ 376

మ. కనులం దించుక లోప మున్న కొమరున్ గన్నంతనే లంజయై
జననింద్యున్ దనుజాతుఁ గన్న నవలా సాక్షీకరోషాప్తయై
చను నంచున్ ముసు పెన్నఁడున్ వినము మా చండాలశాఖాప్తులన్
తనుజుల్ పేర్వెదిపేర్పు డీ వినికి సంధానించె మల్లేశ్వరా॥ 377

మ. నను మా బందుగు వీధి నేగుతటి మున్నన్ "వెఱ్ఱివెంకయ్య" యం
చును తిర్చెన్ బొగరో? వినోదమొ? మనశ్శోకంబొ? విభ్రాంతియో?
కనుకో? మూర్ఛయొ? సన్నిపాతమొ? పరాకో? లేక షోకో? నిజం
బున కే నట్టిఁడనో? వినాశగమకంబో? తెల్పు మల్లేశ్వరా॥ 378

మ. పౌరి నూరెల్లను మోరపై నుమిసెఁ జెప్పుల్ సూపి శిక్షించె నా
మొర శ్రీ వెంకటరావు పాచకుని "మెమ్మే తత్తే" యంచో లెక్కో
కరసంబానఁ జివాట్లు పెట్టె మునుపే గ్రామాధికారుల్ శిరో
భరమున్ మాన్చిరి బుద్ధిమాత్రము జనింపన్ జేసె మల్లేశ్వరా॥ 379

మ. క్రిమి మొక్కేంతయుఁ దప్పకుండఁగ ననేకమ్ముల్ చికిత్సల్ మన
శ్శ్రమమున్ జూడక సల్పుచున్నను భవత్సాహాయ్యసంపత్తిలో
పముచే గ్రామ మనామయత్వమునకున్ బాత్రమ్ము గాదయ్యె. వే
గమ నార్తిమస్థుల కీవు తోడ్పడిన సౌఖ్యం బబ్బు మల్లేశ్వరా॥ 380

మ. తనకుం గాలము వాపరించుటయె సత్యం బట్టులే కానిచో
జను తెల్లన్ దను చూఖుచున్నపుడు తత్సాన్నిధ్యమం దింకఁ దా
మునువోలెన్ జరియింపమిన్ మిడికి వార్మో మొలఁ ద్రిప్పంగ ముం
జను త్రోవం బడి కుక్కతోఁ కగు టిదే చందంబు మల్లేశ్వరా॥ 381

శా. కాపుల్ గొట్టెడ రంపు వెల్గె లుటికన్ గిత్తమ్ము నం బూడ్చి పం
డీ పల్కుల్ తడబై వినంబడెడిఁ గాని యింత దస్కీన్ దవా
లాపంబుల్ ఫలియింపవయ్యె. నిదు కాలం బింక నెన్నాళ్ళు తా
రేపుల్ మాపులు గాఁగ నేగఁ గలదో శ్రీకంఠ మల్లేశ్వరా॥ 382

మ. "ముసరన్ గూర్చెను ముండదేవుఁ" డని మూమూఘించు నీ లెంకను
ర్భగుఁ డీ పాచకుఁ డెంతు కీ చెనఁటు లీగార్పినానకునా?, తేరుగాఁ
కగుచోఁ బోయెడి దేమి? యేరికెని వ ప్పుట్టున్ వెనన్ దిద్దికో
నగు మాంద్య మ్మపకీర్తిదాయకము తర్థ్యం బింత మల్లేశ్వరా॥ 383

మ. కరి పీఠిన్ జను పట్టునన్ మొఱుగుకుక్కల్ వోలె మా కుంకసో
దరులున్ గుంకయు వానిజ్ఞాతులును దుర్వ్యాపారముల్ నాకుఁగా
నఱవన్ జొత్తురు కంటివే కద? మదాంధ్యం బింతలో నైన ని
ష్ఫలమాపాత్రుల రూపు మాపఁ దగదే? భావింపు మల్లేశ్వరా॥ 384

శా. నీ వున్నట్టి నదీతటమ్మనని సూ?నీ లెంక మా కుంకయున్
జావం గాలము చేరువైన గుఱుతుల్ సంధిల్ల బల్ త్రుళ్ళుచున్
దేవానాంప్రియతాప్రయుక్త మసి నా తీరెల్లఁ బై కెక్క దూ
రావమ్ముల్ తఱ చాచరించుట విచారం బేది మల్లేశ్వరా॥ 385

మ. "పుతకల్ దాపినఁ గాని పుత్త్రఋణముల్ వో" వంట? మా కుంక కీ
చెడుబుద్ధుల్ తమపాయమూలమున నిశ్శేషమ్ము గావింపఁగాఁ
బడుఁగా" కంచు మదిన్ దలంచితివొ? తత్ప్రారబ్ధ మాలాటి ద
వ్యోదు నష్టేమ మరల్పఁగా వలఁతు లో యీశాన? మల్లేశ్వరా॥ 386

మ. వగవంగాఁ బని లే దొకం డధముఁ డై వంశంబు గారించుచో
భగవచ్ఛాసన మెట్టిదో కులము సర్వ మ్మట్టిదే యయ్యెఁ గో
ర్కిగనింతం బని యింటి వాసములు లెక్కింపం బ్రయత్నించు నీ
తెగ దీనిన్ హరియింపు మయ్య త్వరలో దేవేశ? మల్లేశ్వరా॥ 387

మ. పచరింపంగల పోరు కేనియును మా యీ కుంకముల్ దాను "శ్రీ
పదరుంబోతులతోఁబ నేమి" యనుచోఁ బంచాస్యముల్ గాఁగ మా
జెవ రప్పట్టున; వీండ్రు గ్రామమును గాఱింపంగ మీబోట్లు చూ
చెదరే? మిన్నక: పాలకత్వ మిది వో? శ్రీకంఠ మల్లేశ్వరా॥ 388

మ. జననున్ గూడిన నాతి తల్లిగద? యా పండాలుఁ డే నెట్టి దు
ర్జనుఁ డే నాపె రమింపఁ దట్టి కృతి మా శాఖాప్పృగిపుత్రికల్

పనిగాఁ జేసి కృతార్థులై రిది మహాపాపంబు నీ విట్టి వాం
ఛ్రి నుపేక్షించుట యీ యుగానుగుణధర్మంబొక్కో? మల్లేశ్వరా॥ 389

ఉ. కులమం ద్రొక్కఁడు దుర్జనుం డయి కులాంకారమ్ముతో సర్వమున్
గులమున్ మాపు' 'నటంచుఁ బల్కుదురు ప్రాక్ప్రాజ్ఞగణుల్; మాదుకుం
కలవంశమ్ము సమస్త మొక్కవిధమై కంకోష్ఠమై గ్రాలు, దు
ష్కలుషం బెంమకు? బ్రాహ్మజాతికిఁ గళంకం బిద్ది మల్లేశ్వరా॥ 390

శా. ఏగుర్ సోదరు లిం దొకం డొక మహాహీనాఘమే, యీ జడుల్
మా గ్రామానకు దాపరించిరి, భవన్మాంద్యంబునం జేసి యీ
రోగ మ్మారక యాప్త మైనెగడెడిన్ దూక్షనలాక్షిస్ఫూర్తి
ప్రాగల్భ్యమ్మునఁ గాని చూపు చెడ దీ పాపమ్ము మల్లేశ్వరా॥ 391

శా. పాపాత్ముల్ ప్రతియూర నుండు టది సంభావ్యంబ వాఁడ్రిట్లుగా
నే పాపంబొ పొనర్చి యందులకుఁ జో టీలేని సన్మార్గులన్
గాపట్యమ్మున నొంపఁ జూడరు. వృథా కాఱుల్ ప్రసంగింపరీ
"ద్రాపుల్" నీచులు వీండ్రు నేయని యకృత్యంబేది? మల్లేశ్వరా॥ 392

(ద్రాపుల్-దరిద్రులు) ద్రాపే అంధసస్పతే ఏరిద్రాం నీలలోహిత"
అని వేదపరిభాష—

మ. పరమాపాత్రుఁడు గ్రామపాచకుని గర్వగ్రంథి "త న్నొంపఁ నీ
శ్వరుఁడే రావలె" నంటకున్ ముదిరె నేఁ బ్రత్యక్షమున్ నింటి నీ
పటుల్ బ్రేలఁగి నేఁడు నీ యుశికవ్మ జ్వాలావళీలక్ష్య మై
యుబ నాగ్రఁగన్ పటి యమ్యె నొక్కో" యని నే హర్షింతు మల్లేశ్వరా॥

శా. గ్రామ మ్మారయఁ జాల నీరసము విప్రప్రాభవం బన్నచో
నేమిన్ లేఁదధమాధముల్ కల వ్విజుల్ హేయ మ్ముపాదేయమున్
భీమంచుల్ గనఁ జాల, రట్టులగుటన్ నీ లెంక మా కుంకలున్
స్వామిల్గాఁ దలపెట్టి దుర్నయములన్ సాగింత్రు మల్లేశ్వరా॥ 394

శా. మున్నే తెల్పితి మన్నరక్కసునకున్ మమ్మాటికిన్ దీటుగా
నున్నాఁడంచును నీదు లెంక, మఱి యీ యున్మాదికిన్ మొన్ననో

ఎన్నో తప్పులు సర్వసిద్ధములుగా నీయందు రాశ్యాా బడెన్
దనైన్యపుణ్య మెఱింగియు న్విడిచె నాతం డంత మల్లేశ్వరా॥ 395

మ. పరమార్థ మ్మెటు లున్న నర్చకుఁ డసన్ బల్ తేలికై రోజుల
ల్లరకున్ దోచెడిఁ బాపరాశిముఁడు వాలాయమ్ము సవ్యాపదే
వరగాఁ గొల్చెడి, వాని నర్చకుఁడు సేవ న్నిచ్చలున్ సల్పు నా
కరుఁగాఁ జూచెడి గ్రామపుంగరిషమున్ గన్గొమ్ము మల్లేశ్వరా॥ 396

మ. ఇఁక మా కుంకలు "మామ మామ" యనియా హీనున్ మహాదాస స
ర్వకునిన్ బిల్తురు పాపకున్ బలెనె యా జాత్యంధులన్ వాఁడు నా
లెకుఁ బిల్చున్ మఱియొండుగ్రామమున నీ రీతుల్ గనం బోల దీ
వెకలుల్ మాఁగురకూటమూరికిఁ గడున్ వ్రేఁగయ్యె మల్లేశ్వరా॥ 397

మ. పెఱ పల్లెలములన్ బొరింబొరిగ మద్వైరాసకున్ బేర్చి యు పూ
జకి దున్నన్ ఖలుఁ బాపకాపశయ మబ్బాధాప్సగీపుత్రులన్
ష్పరలో దత్పలభాక్కులన్ సలుపుచున్ "సాక్షుల"మన్ వేడనా
క్పరహస్య మ్మెఱిఁగించి కైకొనుము మత్కావ్యమ్మ మల్లేశ్వరా॥ 398

మ. తఱ పల్లెలము లైన శ్రాద్ధముఖశబ్దమ్ముల్ పరిసంగించు మా
పరమాపాత్రులఁ బాపకార్చకులఁ దద్వాగర్థలక్ష్యమ్ముగాఁ
బరఁగజా సల్పుట వేదచోదితమ తత్ప్రారబ్ధకర్మాస కై
వ్వరు కర్తల్! సుధిక్కృతుల్ పృథగఁ బోపం బోవు మల్లేశ్వరా॥

శా. నాపై నెప్పుడు కష్టకే సిదెనా మా నాగమ్మ, నాఁ డేమొ సల్
"నీ:పాపాత్ముఁ" డటం బెఱింగి మదిఁ దత్తేమంబు తోసాజునా
నీ పల్గాకె సహాసనాన్నములయం దేవంబు నే నూనఁ ఎ
త్కోపం బాత్మఁ గలంపఁ బ్రేవెడి నవాకుల్ వీఁడు మల్లేశ్వరా॥ 400

శా. "పంచత్వమ్మను పింద్రకి" మ్మనుచు నేఁ బ్రార్థింపఁగాఁ బోసు ని
న్నంచున్ ము న్నని నేటి కెట్లు వ్యతిరేకార్థంబు యూహింతు పీ
పంచున్ బల్కెదో? సత్యమే క్రమముగా సప్పాంత్ర పుర్వృత్తిరా
"పంచత్వమ్మను జాల" దంచు మది తోఁచంచెనె మల్లేశ్వరా। 401

శా. అంతో యింతయొ నాకడన్ జవివి నా యంఘ్రిద్వయం బొత్తి పై
నంతం బందెడి బుద్ధి తారసిలి యత్యల్పాత్ములం గూడి కా
సంతేనిన్ దప్పిప లేక మా జడుడు నన్నాక్షేపణల్ సేయు న
వ్వాంతుల్ సైఁచెడినీదుశాంతి మిగులన్ వర్ణ్యంబు మల్లేశ్వరా॥ 402

మ. గురుఁడ న్నేను మదీయకోప మది నీకున్ రాదు వారింప, మ
త్కారుణాపాత్రుఁడ యేని నీ కొకటఁ గోపం బబ్బఁగా కెట్టిలో
మరణాపాయము తప్పఁ జేయ నగు నిమ్మర్యాద శాస్త్రమ్ము లే
ద్వైతి సిద్ధాంత మొనర్చు నీ వెఱుఁగవే దేవేశ మల్లేశ్వరా॥ 403

(శ్లో॥ శివక్రోధాద్గురుస్త్రాతా గురు క్రోధాచ్ఛివోనహ")

శా. "నీచుల్ వీం"డ్రని మిన్నకున్నకొలఁదిన్ నిర్హేతువైరమ్ము లీ
పేచీకోపులు పెంచ నెంచెద రిసీ? పింజారిబల్ మూఁకతో
కాచపాప్రియులతోఁ నసామకులతోఁ "గా"దంచు, "నా" నంచు నే
వాచారంభణముం బొనర్చుట మహోపఖ్యాతి మల్లేశ్వరా॥ 404

మ. దురితాత్ముల్ ఋషులన్ వృథా ఛెనకి తద్దుర్వారకోపానల
స్ఫురణన్ బ్రమ్మగి"రటంచుఁ గ్రంథములఁ బ్రాగ్సూర్యగ్రణుల్ వ్రాసి యుం
చిరి వీండ్రిట్లనె నాకతానఁ జెతుటల్ సిద్ధాంతమే "నాస్త్రృషిః
కురుతే కావ్య" మటన్న మా తెలుఁగవాక్యోల్? నీవు మల్లేశ్వ

శా. ఛందోబద్ధముగా మదీయ మగు వాక్యంబందు వెల్వెట్ట యే
సందర్భమ్మను లేశ మేనియును, తూ, ఛా, తప్పకుండన్ ఫలం
బందన్ గల్గుట నీ వెఱింగినదె యీ యల్పాత్మ లిద్దానిచేఁ
గుందున్ గుద్దురొ? విందె గుద్బెదరొ? కన్గోవయ్య? మల్లేశ్వరా॥ 406

మ. ఒక వడ్రింగికి వాని సోదయున కన్యోన్యాసు పీడాకరం
బకులోహేతుక మైన పోరొకటి యీ యల్పాత్మ లెట్టెట్టులో
ప్రకృతం బేర్పడఁ జేసి రిట్టి చెడుగుల్ పల్మారు గావించు పా
తకులన్ ఘాతుకులన్ బకప్రకృతులన్ దండింపు మల్లేశ్వరా॥ 407

శా. "దారిద్ర్యమ్ముఁ ఘటింపు మంటి" వటు సంధానింప నిప్పింపవే
ప్రారంభించితి నందువో? నిజమె తాపన్మాత్రమే యైన నీ
కార్యల్ దారికి వత్తు రంచు మది నాకుం దోఁచవట్లాట నీ
కాఱుంచున్నల చూపుమాపుటకు సంకల్పించు మల్లేశ్వరా॥ 408

మ. సుజనుల్ రిక్తత చేరి జ్ఞానగరిమన్ శోధించు. దుర్మార్గపుం
బ్రజలున్ రిక్తత చేరె నేని యది చౌర్యప్రాపకంబై రహిన్
వృజినంబున్ వెనడించు పిండ్రిసుల మా యా ప్రవృత్తిం జేరంబుచున్
రజనీదేవత చెప్పు నాపె గద చౌర్యజ్ఞాత్రి మల్లేశ్వరా॥ 409

మ. లవ మేనిం ప్రియ యున్నచో నరుఁడు శీలమ్మెంచు వర్తించు మా
పాపముం బోతుకుఁ గుంక కద్దు సుతరామున్ లేమి స్పష్టంబు యీ
యవివేకం దపు దప్పు రాగమని తా నాలాపనల్ సేయు యూ
రవ మాలించిన సర్వముల్ దెలియు నైర్లజ్జ్యంబు మల్లేశ్వరా॥ 410

శా. హ్రీ సామాన్యము గాను పెద్ద గుణమా హ్రీలోపముం జేసియే
స్త్రీసౌశీల్యముఁ బూరుషోన్నతియు భస్మీభూత మైపోవు న
వ్యాసహ్యమ్ము లగున్ మహోన్నతము లౌ నయ్యై యుపీకారముల్
హ్రీసంపన్నము గాని ప్రాణి మిగులన్ హేయంబు మల్లేశ్వరా॥ 411

శా. స్త్రీకుండన్ వలెఁ గాని పూరుషునకున్ హ్రీయుండ రాదంచు సు
శ్లోకుల్ వ్రాసిన వ్రాఁత కాదన నెవన్ శోధించి తత్తత్త్వసూక్తుల్
ప్రాకట్యమ్ముగ నిర్ణయించు నెడ హ్రీ భావార్థమే కాక స
ద్భీకల్పద్రుమపుమర్ధ మంచుఁ దెలియున్ దేవేశ? మల్లేశ్వరా॥ 412

శా. హ్రీమత్త్వ మ్మెట నుండు నయ్యెడలనే శ్రీమత్త దా నుండు సు
శ్రీమత్త్వ మ్మెట నుండు నయ్యెడలనే హ్రీమత్త తా నుండు నీ
శ్రీమద్ధీమవభేదముం గుఱిచి నేఁ జెప్పం బనే మున్న? త్వ
ద్భామారూపము లీ ద్వయం బనుచు సిద్ధాంతమ్ము మల్లేశ్వరా॥ 413

మ. "నగుచున్ జేయుచు రేడ్చుచుంగుడుతు" రన్నాటించుకంలేని యీ
పొగరుం బోతు తెలుంగ రెల్లపుడు తప్పుల్ సేతురే? పుట్టుతే

యగుచో లెంకకు నెన్ని యెన్ని యగచాట్లయ్యెన్ గతాసేహమం
దొగినేఁడేనియు బుద్ధి వచ్చినదె? నీవూహింపు మల్లేశ్వరా॥ 414

శా. స్నానార్థమ్ముగఁ గంఠదఘ్నజలవాసం బందియున్ జుట్టగా
ల్పే నిర్భాగ్యుఁడు మానఁజాలఁడొ తత్త్రిపాహేసున్ జతున్ వాని న
జ్ఞానిన్ బాపకు నూఁతగాఁగొని ననున్ సాధించు మా కుంకమున్
కానున్నట్టి యనర్థ మించుక యెఱుంగన్ లేరు మల్లేశ్వరా॥ 415

శా. "కానుండెన్ క్షురకర్మ" మంచుఁ దెలుపంగా నొక్కోఁ? యీపుణ్యదా
సీ నీచాత్మకుటుంబినీ సహితుఁడై చెన్నాయు నీ లెంకతో
మా నాగమ్మకు వేంకటేశ్వరుని సమ్మానమ్ము యావచ్చెనో
జాసిశాపహరమ్ము కన్పడెడి దేవా? చూడు మల్లేశ్వరా॥ 416

మ. తిరుపత్యద్రికి నేగి యయ్యెడల నీ దృప్తాత్మకుల్ పూర్తిగా
క్షురకర్మమ్మున కగ్గమైన కతమున్ శోధింపఁ దన్నామ ధా
మ్వరు నేతక్కువి దూఱలాడు నఘమున్ బాయఁగా బ్రియత్నించుటో?
మఱి యేమో వివరింపుమయ్య? మది సంభావించి మల్లేశ్వరా॥ 417

మ. పరమాపాత్రుఁడు దాసియున్ జతుఁడు తప్పుంధుబ్రజంబున్ దనున్
బరివేష్టింపఁగ నేసుఁ గా కఘ మెఱిగిన్ బాయంగ నీ లెంక లా
నరదేఁ తిర్పతికీ ఘనం దకటిఁయే మం చేగెఁ? తద్దాసికా
చరణారాధన కొక్కోఁసి గ్గుడిగి మా జాల్మ్యంపు మల్లేశ్వరా॥ 418

మ. ఇల దుత్తూరము భంగమున్ గలియుచున్నట్టి దుష్టుఁడున్ దుష్టుఁడున్
గలియున్, బ్రిస్తుతమైతిప్రి యట్టిద యగుం గాకేమి, యీ దుర్జనుల్
వెలియై యెక్కడొ మ్రొగ్గ కక్కటకటా? విశ్వేశ? క్షేత్రమ్ములన్
గలుషమ్ముల్ పొనరింప నేగుట కడు న్గర్హ్యంబు మల్లేశ్వరా॥ 419

మ. తురకల్ దుష్కరులై దురంతముల కుద్యోగింప సింహాద్రి శ్రీ
నరసింహాంశు హరింపఁ గూర్మకపివిజ్ఞప్తిన్ మదిం బెట్టి యీ
పరమాపాత్రు లొనర్చు దుండగములన్ బాపన్ వాక్రుచ్చినో
శఱుగన్ జొచ్చె నుపేక్షచల్పె దిది యేమయ్యయ్యొ? మల్లేశ్వరా॥ 420

మ. తిరుపత్యాదిస్థలికి దాసితోడఁ జనియెన్ దృష్టుండు నీ వెంకనే
హరియించఁదగుఁగాక దాసి ననదన్ హంతవ్యగా నెంచి యే
ద్రోహ మెవ్వంట హరించు టన్నది భవత్ త్రీవ్రాక్షికిన్ దుర్వశ
స్కారమే త ప్పెటు తప్పెకోఁ దలఁచితో సర్వజ్ఞ? మల్లేశ్వరా॥ 421

శా. దాసీరండను జంపఁబోవ మది నావా? నీదు పే ర్వానిదా?
యీసున్ జెంది వృథాగ న న్నెదవే? యీవంద్ము వే నొప్పితిన్
దాసిన్ జూడఁ పతండు స్త్రీవధయుఁ దా వర్జింపఁ డౌఁగాక యీ
కాసున్ జేయని దానిఁ జంపుట వృథా కర్జంబు మల్లేశ్వరా॥ 422

మ. కుసుమన్ బెట్టదు నీదు భూములను నీకున్ జీఁకటిల్ సూపఁదే
వసపలె వ్రేలిడుపూజనీయుల, మృషావ్యాజ్యమ్ముల౦ దెచ్చి పో
రదు. విప్రస్వము లైన వృత్తులకు నేరం బేమియున్ లేద. యే
మిడి దాసిన్ విడి దానిఁ జంపె నలమేలీశుండు మల్లేశ్వరా॥ 423

శా. దేవాదాయపుఁబెల్లు బిజ్జబిగిసెన్ దీనుండు నీ వెంక నిం
కేవారున్ జెడఁదీయనక్కఱవి లేసేలేమ మా కుంకలో
మేవం బెల్లదు నెల్లు గాంచెదరొ యల్లే వోదు రెప్పట్ల నీ
దేవానాంప్రియు లార్తి గాంచెద రఘాబ్ధిన్ బ్రుంగి మల్లేశ్వరా॥ 424

శా. కుంకల్ పంచక మంచిలో నలువురన్ గొండొక్కవా క్రుచ్చితిన్
బంకాలక్ష్త్రిత్వమునంచుఁ బంచముఁడు తా బాలుండె యయ్యు న్నిరా
తంకుం డన్నల కన్న వానిని భవత్స్వాంతం బెఱుంగున్, గడున్
బంకుంగాడిదకొడ్కు వాని చెడు చర్యల్ విన్మ మల్లేశ్వరా॥ 425

మ. బడికిన్ మా చినకుఱ్ఱఁ డేఁగుతఱి నీ భ్రష్టుండు నిష్కారణం
బొడికెన్ బాపము గట్టికోఁ దలఁచియొక్కో? యేమొ దుర్భాషలన్
జెడఁ బ్రేలున్, వినిపించుకో కరుగ "నిన్నే నిన్నె" యం చావ్చు నీ
మడుకున్గాడిదకొడ్కు కేటికొకొ? యీ దుర్బుద్ధి మల్లేశ్వరా॥ 426

మ. "కలిచెంబో? ఘనకంబు దానిఁ గఱవంగాఁ బోవు నెవ్వాఁ డ" టం
చుర కెవ్వాం డ్రుపేక్షసేయ మిగిలెన్ భుద్దావరం వీడెడుం

మ. తన మేనల్లుని "విన్నతమ్మునకు నేతత్పుణ్యకార్య మ్మిటుల్
కొనసాఁగింపు"మటంచుఁ దో చాఁగె నీ కుంకన్న; తప్పొ ప్పెఱుం
గని యా కుఱ్ఱలు కాకు లట్టు లఱనంగా నీవునుఁ వింటి వి
పనికిఁ నీ హృదయంబు నొవ్వమియు నేపం బయ్యె మల్లేశ్వరా॥ 434

మ. "తన కుఱ్ఱం డిటు నున్నవాఁడటుచు విద్యాగ్రామ"ముం చెంది నం
దను డించెన్ జనకుండు మాతులగృహస్థానమ్మునన్ వీంద్ర దు
ర్జనతక్షా పర్వము తా నెఱింగియును; గుఱ్ఱం డీ గతిన్ మాతె, నొ
జ్జను చేయం దలపెట్టఁ గోఁతి యగుటే సత్యంబు మల్లేశ్వరా॥ 435

శా. పాపం బేతఁడు మొందలించెఁ బ్రియకృతపాపిరద్బుదుష్కర్మలన్
గోపాటోపము చూపి స్యాలకుల;నీ కుంకన్న లా బుద్ధి తా
మేపాటిన్ జెవిఁ బెట్ట కాతనికిఁ దామే పాఠమున్ జెప్పఁగా
నాపద్గాము లటంచుఁ దా నడిగె నయ్యార్యుండు మల్లేశ్వరా॥ 436

మ. అతఁ డివ్వాంఛ్ర యపాత్రవ ర్తనకు నత్యంత మ్మెదన్ రోసియున్
సుతు నిప్పావులయొద్ద వీడుట కటున్ శోచ్యంబు, సద్వ ర్తనుల్
పతితాశౌచముగూడ వీడి రటటన్ బంధుత్వ మేమయ్యె దీ
క్షితచారిత్రము నీ వెఱుంగనిదిపో శ్రీకంఠ మల్లేశ్వరా॥ 437

మ. కుమతుల్ లే రని కాదు గాని భువి మా కుంకన్నకున్ దీటు గా
నము.వదిగ్రింగుల బోషసీ వెఱుఁగు దీ నాగమ్మయే పెట్టె లా
భ మపేక్షించి;య దెట్టి దన్న?విను తద్భ్రాతృద్వయమ్మంచు వి
క్రమముగా నొక్కని కొంప దీయుటకె సంకల్పంబు మల్లేశ్వరా॥ 438

మ. అల పదిగ్రింగులయం దౌకానొకని భార్యన్ వీఁడు కామించి వా
రలఁ గోర్టెక్కఁగఁ జేసె, భర్త కసులారన్ గాంచి సీ? యంచు న
య్యెలనాగన్ విడి వీని జీవమున కెంతే నెద్బుచుం బోయె నే
యిలకో,వాడయుఁ గానవాదు కనుఁగొంటే?తండ్రి? మల్లేశ్వరా॥ 439

మ. పను లీలాటివి ఏం బ్రానర్చునపుయిప్పాపాత్మకుల్ స్వీయదు

ర్జనతన్ వీడమి నీ వెఱుంగుమవు సాక్షిద్రష్టవే కాక స
ర్వనియంతృత్వము గల్గు నీ కొకఁ డవార్యం బౌనె? మల్లేశ్వరా॥ 410

మ. అపవిత్రం బగు మోరతోడ నపవిత్రాలాపియై చుట్టకా
లుపుమర్యాసనతోడఁ బాపకుఁడు నీ లోగింటికి న్వచ్చి య
ష్టపు దయ్యార్చకకృత్యముల్ సలుపు,ని న్నవ్వాని దౌరాత్మ్య మే
వపడన్ జేయమి కక్కజంపడి సుమీ? ప్రశ్నింతు మల్లేశ్వరా॥ 441

శా. వీనిన్ జూచిన వీని గాథ వినినన్ వీనిన్ సమీపించినన్
"సీ! నింద్యం" బను బుద్ధిపుట్టుట స్వత స్సిద్ధంబ య ట్లౌటచే
వీనిన్ శూద్రజనుల్ త్యజించిరి శుభావిఖ్యాతులన్ బూర్తిగా
ఏ నీచుం డితు కూడు నీవు తినుటల్ హేయంబు మల్లేశ్వరా॥ 442

మ. ఎపుడున్ జోరకళాభిభూతుఁ డగు నాయీ పాపకుం దేడ?ని
త్యపవిత్రుల్ హానరింపఁగాఁ దగిన నీ యర్చాదికం బేల?యీ
శ్వపచున్ జంపియొ లేక కా ల్వెడలిచియో,సాక్షిద్భవ ద్దేహమం
దపమున్ మాత్రము ద్రొక్కనీకు మిదియే నా కోర్కె మల్లేశ్వరా॥

మ. మొన మా టంకలలోనఁ బంచముఁడు బల్ ముగ్ధుండు మేనల్లుడున్
దిని కూష్మండి వృథాగ మామకకలార్థిన్ "లంజకొడ్కా?" యటం
టనిమిత్తమ్ముగఁ దిట్టుటే వెఱఁగు దీ యన్యాయ మేలాటిదో?
పని సేవ్యక్కెప్పుడిఁ దెల్పఁ జాలుదమె? యో విశ్వేశ మల్లేశ్వరా॥ 444

శా. నీ పూరేగెడివేళఁ గుంకమొదలౌ నీచాత్మకుల్ స్వీయదు
ర్వ్యాపమ్ముల్ ఏకసల్ల మామకగృహద్వారస్థు నన్ జూచి యో
దేవా? పేర్లెడిపేర్లుడున్ వినియు నీదృష్టాత్ములన్ వేర్లిడ్రడిన్
జాపన్ జూడని నీదు శాంతికి నమస్కారమ్ము మల్లేశ్వరా॥ 445

మ. ఎపటన్ బల్లకె నున్న నీ యునికి కేం దేవ్రమాత్రి మూహింపకే
వదరుల్ పేర్లెద, రిట్టి దుర్భాషల నీఫాలనక్కాల దు
ర్మద మాడింపమి యక్కజంబు. మఱియుం బాపంబు వర్ధిల్లి యు
య్యది యే తత్ప్రతికర్త యౌ ననెదె? యట్లౌఁగాక మల్లేశ్వరా॥ 446

మ. దురహంకారులు పిండుఱ నన్నుఁ గని శత్రుత్వమ్మునం జేసి తుం
టరికృత్యమ్ము లొనర్చి వెల్లమొగముల్ నానాఁట దారిద్ర్యదు
ర్భరమునా గ్రిక్కి సహించుచుండి రసుటల్ ప్రత్యక్షమే కాని యు
త్తర మీ దుష్టుల మాపుమాపుటకునై ప్రార్థింతు మల్లేశ్వరా॥ 447

శా. కూడుంగుడ్డలు లేక మాడుచు వనేకుల్ గోడుచున్నార లీ
పాడుంబీనులఁ గూర్చి. యట్టి కశయున్ బ్రత్యక్షమై పూర్తిగా
వాడున్ మోరల వ్రేలుచుండినను నీ వాడమ్ము లేమాత్రమున్
గూడన్ దుంటరిపోకలన్ విడిచి యోగ్యుల్ గారు మల్లేశ్వరా॥ 448

మ. హితులై కొల్చుటకన్న శత్రు లయి న న్నే కాఁతలో కూసి యు
ద్ధతులై మత్కృపితాప్రహతహతులై యాయుఃకలన్ రోసి దు
ర్మృతిం బొల్పుదురే సుఖం బనుచు నీ మేధ్యేతరుల్ చాల దు
ర్మతులై రంపఁ దలంతు నింతయు యథార్థంబయ్యె మల్లేశ్వరా॥ 449

మ. ఇది మా కుంక నెఱుంగ నెల్లరును "పీఁడే చావు రాఁజచ్చునో
మొటకుం బోవునొ చచ్చియుంతటి. జడున్ హీనున్ గృతఘ్నున్ మహా
క్రూరుఁ జూడన్ ఘటియింప దీ తులువకున్ గాలమ్ము దాపై వృథా
రటనం బేర్చెదె నంచు రయ్యెడి యపార్థం బౌనె? మల్లేశ్వరా॥ 450

మ. ఋణ మేర్పడ్డది, భూమి పోయినది మున్నే కొంత. నేఁ డున్న యా
యణుమాత్రమ్మునఁ గొంత యమ్మఁబడె నేవ్యం బన్నదో లక్ష్మి బ్రా
హ్మణులం దుండదు పేదె చెప్పవలెనే? మా కుంక కిట్లయ్యె దు
ర్గుణముల్ మాత్రము తగ్గకున్నయవి కన్గోవయ్య? మల్లేశ్వరా॥ 451

మ. విధవన్ మ్రొక్కినఁ "దస్సుఁబోయి" మని దీవించుంగదా? నేఁడు మా
యధముం డట్టిదె యర్భకున్ విధవ నత్యంతమ్ము సేవించి దు
ష్పథసంచారమునన్ దరిమ్రిఁ దలఁ తత్ప్రామ్యమ్మునం బూర్తిగాఁ
బ్రిధమోదాహృతి యయ్యె సర్వము సుసంపన్నంబు మల్లేశ్వరా॥ 452

శా. ఎద్దుల్ బండియు జీవనార్థ మగుతే హేయమ్ము తన్మాత్రిఁగా
కిద్దుఃఖమ్మున తాళ్ళు దోలుటకునై యేర్పాటు గావించుటో

తద్దన్ మర్గతి, యటి మఃఖమ్మని మా పద్దమ్మనే నేఁ కుండె నిం
క్రిద్దారిద్ర్యము ఫల్లు నిగ్గు వడఁ డీ హీనుండు మల్లేశ్వరా॥ 453

శా. ప్రాయశ్చిత్తము కొంత చేసితివి తత్ప్రారబ్ధమున్ ద్రిప్పఁగా
నీ యుద్యోగము చాలదయ్యె, నటులైనే నన్ను నిర్మించితే
డాయున్ రోయను గూడ నేవపడుదున్ నామాట లాలించి యీ
శ్రీయోధూరుల రూపుమాపుటయె సంక్షేపంబు మల్లేశ్వరా॥ 454

మ. ప్రకటం బయ్యె భవత్కృపారసము నాపై నీవకున్ గ్రామపా
లకు నేఁడే చెడఁదిట్టి వాని యనుఁగుల్ చాలేక జీవింపఁగా
నక "మొక్ష్ట్రో" యని యేష్ప వాద్యములతో నన్ బల్లకీ నుంచి త
క్కక యూరేగఁగఁజేసి తేడియె ఖుషన్ గల్పించి మల్లేశ్వరా॥ 455

మ. తెలిసెన్ నీమ కుయుక్తి వెల్మదొరనేఁ దిట్టించి తప్పొప్పకున్
పలుఁగాకెన్ శునకప్రలాపుని: నభావ్యాజమ్మున న్నాకుఁగా
వులచే నుత్సవమున్ ఘటించితివి నీ పోకల్ సమస్తమ్ము ప్రా
జ్ఞులిపే కైకొనుటల్, భవద్రిపన బల్ గాఢమ్ము మల్లేశ్వరా॥ 456

శా. ఎన్నోసార్లిటు లీ యమేష్యులకు సమ్మాన్ శాస్త్ర మట్లయ్యె నీ
యన్నల్ నైజగుణంబు వీడదు సుమీ మర్త్యత్వ లింకీ పయిన్
మన్నల్ గూడ ఘటించి చూడు మెకచోఁ; దప్పొత్తిచే నీ జడుల్
కన్నుల్ విప్పుదు రేమొ చూత మదియుం గానిమ్ము మల్లేశ్వరా॥ 457

శా. తన్మానన్ శ్వానసముకన్న నీచముగ నేతద్గ్రామవాస్తవ్యులా
పెన్నల్ పెద్దలు గూడఁ జూపెపిటి మా పెండ్యాల దేవయ్య యీ
మన్నన్ బూర్తిగఁ బా నెఱింగియును దుష్కార్యాల్ విడంబోవఁ డా
సన్నాహాయుల లక్షణమ్ము లివి వోః చర్చింప మల్లేశ్వరా॥ 458

శా. నానాదేశములున్ జరించితిని నానారాజ్యసభల్ సూచితిన్
నానామానవజాతివర్తనములన్ నానాఁట శోధించితిన్
నానామూఢులఁ గాంచితిన్ మఱియు నానానీచులన్ నెట్టితిన్
గానీ మాజననింద్యుఁ బోలు ఖలునిం గన్గోను మల్లేశ్వరా॥ 459

శా. ఊరన్ వర్తిలు పూవ్రికోటి ననుఁ దా నూరేఁగఁగాఁ జేసెఁ బో?
పేరుం బెంపును గల్గు పొంపెఁ దనకున్ బెండ్యాలదేవయ్యఁ క
య్యారే? వల్వని వంత యేమిటికొకో? యల్పుండు వీఁ డిట్టులే
నీతై పోవఁగ ధాత వ్రాసెనొ? కదే? నేఁ జెల్లి మల్లేశ్వరా॥ 460

మ. తలిదండ్రుల్ గుణవంతులైన యెడలన్ దత్పుత్రుఁడై పుట్టఁగా
వలయు న్గానియెడన్ మనుష్యజని దాల్పన్ రాదయే వృక్షమో
శిలయో లేక మెకంబొ తా నగుటయో శ్రేయంబు మా కుంకలీ
కలుషానన్జుమి? యింతగాఁ జెడుట నిక్కంబింత మల్లేశ్వరా॥ 461

మ. కొడుకుల్ దుర్మతులైన తల్లులును బెక్కుల్ లోకమం దుందుర
ప్పడఁతుల్ గొక్కు లొనర్చు దుష్కృతులపై వాత్సల్యమున్ జూపి యె
క్కుడు ప్రోత్సాహ మొనర్పరట్టి దిటఁ గన్గో నయ్యోడిన్ వీఁడ్ర కీ
చెడుచెయ్వుల్ జన నీ ప్రసాదము సుమీ? శ్రీకంఠ మల్లేశ్వరా॥ 462

మ. నను నూరేఁగఁగఁ జేసి రన్న నుడి కర్ణంబుల్ ప్రవేశించి యా
ఘనురా లొందిన బాధ నీ మదికె తార్కాణంబు. తత్సాధ్వి యా
వను దిన్నట్టిదిపోలె? బిట్టఱచు నవ్వాగ్వైఖరుల్ వింటివా?
యనయుల్ రత్నతి కుద్భవించుటయు దూష్యం బౌనె మల్లేశ్వరా॥ 463

మ. అలఘుల్ నన్ను సభాధిపత్యమునకై యాహ్వానముల్ సేయ మా
పలుగుంగుంకలెఱింగి యేత్తు రఁట? పాపం బీసుకున్ దాసులై
తులువల్ దల్వని వంత లోఁ గొని యిటుల్ ఘూఘూలకున్ బాత్రులై
రిలలో నన్యుల వాసి కీసు గొను వాఁ డేమౌను? మల్లేశ్వరా॥ 464

మ. చదివెన్ మొన్నటివాఁక శిష్యుఁ డయి యే జాల్ముండు వాఁ డిప్పుడే
బెదరున్ లేక వృథాగ దూఱు నఁట నన్ పేరెత్తి. యవ్వాని త
ప్పిదమే మున్నది? వాని కట్టి చొరవన్ బిట్టిచ్చి పుట్టించు త
ప్పిద మెల్లన్ భవదీయమే నెఱుఁగుమన్ విశ్వేశ మల్లేశ్వరా॥ 465

మ. గురునిందన్ బచరించినన్ వినరు మూర్ఖుల్ గూడ మచ్ఛిష్యుఁడే
చరితంబుం బొనరించి పుట్టెనొ గుమన్ దుర్భాషలాడంగ నీ

ఫర నేతాదృశుఁ బుట్టఁ జేసి మిగులన్ ధన్యత్వమున్ జెందె నీ
చరితం బిందుల కేను సంతసిలెదన్ సర్వేశ? మల్లేశ్వరా॥ 466

మ. దుర్వృత్తుల్ భవితవ్యముం గనక యద్దుఃఖమ్మునం జేసి యం
తర్వాణిన్ దరవాణి. యం చలచుచున్ దత్తేజమున్ మాన్ప మా
గర్వగ్రంథు లొనర్చు దుర్నయపుఁ జోకల్ గంటివే? పిండ్రికున్
సర్వాంగక్షురకర్మ మిప్పనుచె సూ? సంభించు మల్లేశ్వరా॥ 467

మ. తనకున్ లాభము రెండు వేలదనుకన్ ద్రవ్యమ్ము చేకూరునం
చెనుఁ బోతన్నకు నీ కృతిప్రవర మచ్చేయైనచో వెక్కిరాఁ
దను మోదించెడి నంట? కుంక యిటు తా నంజాఁక యున్నం గదా?
తన మర్యాదకు వ్యాజ్య మేమఁ గలుగుఁజా దక్షయజ్ఞ మల్లేశ్వరా॥ 468

మ. తనకున్ లాభము నన్నవస్త్రములు విత్తమ్మాయువున్ సర్వనా
శనమున్ జేసిననాఁడె యీ కవితప్రస్తావాగ్రమై ప్రాజ్ఞతా
ఘనులం దెల్లెడ వ్యాప్తిఁ జెందెడి నటుల్ గాకున్నచో దీనికిన్
బనియే లే కొక మూలనే యడఁగెడిన్ బ్రోల్వాలి మల్లేశ్వరా॥ 469

మ. ఒక చాల్కొం దొక పత్యపైన్ జెనకె యెన్నో తప్పులుం ద్రోసలన్
వెకలుల్ గొందఱు తోడుగా మెలఁగి భావిశ్రేయమే కాక తా
సకలమ్మున్ వికలమ్ముగా సమసె, నన్ చారిత్రి మిద్దాసిచేఁ
బ్రకటింపంబడుఁ గాక నీ కృప యథార్థం బౌచు మల్లేశ్వరా॥ 470

మ. తనకున్ దద్దినముల్ ఘటింపఁ గల నోవప్పుల్ గరా రంతః వెం
టనె నాపైఁ దెగి తాను జచ్చు నటః నీ నామాంకితం బైన యీ
ఘనకావ్యమ్మును నైవఁ జాలఁ కటః కుంక స్వల్లోగినెన్ ప్రేవెఁ వ
దద్దినపున్ముప్పట దీర్పఁజేయు నిదే లోటు మల్లేశ్వరా॥ 471

మ. తనకున్ దాపర మైన కాలమున పత్త్రద్వారమం దుండి ల
ద్దినపుం గోర్కెను వాగ్వధూమణి మె నిర్దేశింపఁగా డోలు, ని
చ్చెను మున్ గోరఁదె కుంభకర్ణుఁ, డటులే పద్దమ్ము తాఁ నద్దిన
మ్మును గోరెన్ మురిపమ్ము తీర్చి యుపమ మున్నాళించు మల్లేశ్వరా॥

మ. మన మణా మాఏ "తథాస్తు" దేవత లొగిం బాటించు వారై "తథా
స్తని సార్థక్యము హెచ్చుచుందు రంబః మా "యంబ్రహ్మ" వావల్ ఖం
బునకున్ దక్కఁ బదన్యముం దెలియమిన్ ముష్టిల్ వెసన్ బొడ్చుఁచు
ద్దినమో తద్దినమో" యటంచుఁ గను తద్ధీమత్తి మల్లేశ్వరా॥ 473

మ. పరమాధాస్యుఁడు వీఁడు శిష్యుల నొగన్ బిర్మాణుఁ దాఁడిట్టుము
ష్కరుఁడై కొట్టఁగ నంగ, నాకతనమచ్ఛాత్రుల్ తనుంగొట్టి రం
చెఱుఁగున్ నేనిడ నాజ్ఞవారలకు నీవే వీని దోరింతు వం
చురకీ వెంమల కాలసించెదవొ? నే నూహింప మల్లేశ్వరా॥ 474

మ. కుంకల్ సల్పెడి తప్పుడుం బనులు ఓకున్ చెప్పితిన్ వీండ్రి యి
ప్పంకమ్మున్ విని రాజరాజపురిఁ జెంపల్ వాయఁ గొట్టంగ ని
శ్శంకుల్ గొందఱు సిద్ధమై రదియు దోసం బంచు వారించితిన్
మంకుంగుంకల స్వాపరాధము లెపంబాళించు మల్లేశ్వరా॥ 475

మ. ఒక విద్యార్థిని గుంకలందున ద్వితీయుం "దొర! మా శాస్త్రి సే
వకటా? యేరికొ చెప్పినాఁడ" వని యన్యాయమ్ముగాఁ గొట్టఁగా
నకలంకుల్ గని గ్రామపున్ ఘనులు పాప్రియశ్చిత్తమున్ జేయ మి
న్నక నోర్మూసుక పెద్ద కుంక యొదిగెన్ గన్గొంటె మల్లేశ్వరా॥

శా. మా కర్మమ్ములు కాలి శాస్త్రులయెడన్ మర్యాదకున్ దప్పుటన్
లోకుల్ "తుంటరు లండ్రు మ" మ్మని కనుల్ లోలో జలంబాన దు
ష్పాకుం డూరక కుంక యేడ్చె నఁట? రచ్చన్ బిల్వఁగాఁ బోయి యీ
నీకొట్టుం బ్రదు కేల చావఁ దగదే? శ్రీకంఠ మల్లేశ్వరా॥ 477

మ. తన దౌర్జన్యము రచ్చకీడ్చెనని మా దద్దమ్మ తమ్ముండు తో
వ నెటో కాచి కలార్థిఁ బట్టికొని తత్ప్రాంతమ్మునం పేరు తే
మిని "దిక్కెవ్వరు? నీ" కటం చడిగి బల్మిన్ రేయిఁ గొట్టెన్ జుమీ?
యనయున్ దుర్మదుఁ జూచి సైఁచుటయు న్యాయం బౌనె? మల్లేశ్వరా॥

మ. ప్రతి విద్యార్థిని వెక్కిరించుట మొదల్ పాపిష్ఠకృత్యమ్ము లి...
ప్పతితుల్ కుంక లొనర్పఁ బూని రది నన్ బాధించు నంచెంచి దు

ర్మ్మతు లీ తుంటరు లిక్కటమ్మునన భస్మం బౌచు రం బేఁదలం
చితి ముమ్మాటికి నట్టులే జరిగెఁజూ శ్రీకంఠ మల్లేశ్వరా॥ 479

మ. చట్టుఁబట్టుల నుండు గ్రామముల "నీ కుంకన్నలన్ గట్టిగాఁ
గొట్టంగావలె" నంచుఁ గొందఱును, "నీ కుంకన్నలన్ జెప్పుతోఁ
గొట్టంగావలె" నంచుఁ గొందఱును సంకోచమ్ములన్ వీడి బల్
పట్టుంబట్టి వివాట్లువైచిరి మొగాల్ వాడంగ మల్లేశ్వరా॥ 480

మ. ఇటుపై శాస్త్రులఁ గాని శిష్యులనుగానీ మీరు మీవాండ్రు ము
న్నటి పోల్కిన్ జెనకంగఁబోవునెడ మీ ప్రారబ్ధకర్మంబు కా
లుట ముమ్మాటికిఁ దప్పదన్న పలుకుల్ కుంకల్ చెవుల్ సూచ స
క్కటి? యాలించియు దుర్విదగ్ధపుగతుల్ గైకొండ్రు మల్లేశ్వరా॥ 481

మ. జరిగెన్ గుంకలయింటనేఁ దొకమహాశ్రాద్ధంబు, నన్నెవ్వడన్
జోరి దూషించుటయే ప్రతిశ్రవణమై పొల్పారుటల్ వింటిఁ దుం
టరు లీ కుంకలయెల్ల శ్రాద్ధము లిటుల్ నా దూషణం బొప్పఁగా
జరుగుంగావుత నీ యనుగ్రహమునన్ సర్వేశ మల్లేశ్వరా॥ 482

శా. ఏ విద్యార్థినిఁ గొట్టెనో యతఁడయా రీ కుంక తా నేగెనో
దేవా? యంతటఁ జెప్పు చేతఁ గొని "ఓరీ? దిక్కేడి? నిన్నిప్పుడేఁ
జావంగొట్టినఁ జెప్పు" మం చడిగె మహాత్రాగ్రజుండు; వా
ర్జీ వెట్టైన్ మనదేశె నీ వెఱుఁగవే? సిగ్గేది మల్లేశ్వరా॥ 483

మ. మగసిన్ గొట్టియు నాత్మమోహమునకున్ మల్లాది ఫిర్యాదొన
ర్చఁగ యాశిన్ బురుడించుచున్న మన యీ కుంతస్మ దుర్వృత్తికిన్
దిగవట్లున్ దగ మోసపోదురు? కదా? తథ్యేతరాలాపులన్
మొగమున్ మోదున్నవయేని నిన్నెవఁడు నమ్మున్ దేవ? మల్లేశ్వరా॥ 484

శా. దుర్జాతత్వము కల్గి మా ఖలునకున్ "థూ! థూ!" లకున్. జోలి జే
దౌర్జిత్యమ్మును లేద తెల్పియును నా నామాత్రమే. యట్టిదౌ
దౌర్జన్యంబె సహింపమై దొసఁగొగన్ దాఁ జేసి వార్జి నిడెన్
నిర్జీవం బగుఁ గాక పీనిపని పీనిన్ మ్రింగి మల్లేశ్వరా॥ 485

శా. మోకాల్నొప్పి కలార్థులన్ గాంచి యేమోహానమున్ జేసినన్
వీఁకన్ బోయెదిరంట? కుంకన యిటుల్ పేర్లన్ మొదల్వెట్టి సు
శ్లోకం బేలో? కలార్థులన్ గనిన మా కుంతన్నకున్ వీని దు
ష్పాకం బింతగఁ బండఁ బాజియు నుపేక్ష్యం బౌనె మల్లేశ్వరా॥ 486

మ. ప్రకటింపంబడెఁ గుంటపర్తినరుకుల్ పంచాయితీ కోర్టులో
వికలుండై మొక మంత చేసికొని నిర్వీణ్ణుండునై యెల్లరున్
మొకమందే "తుథూథూతుథూ" యరియ మా ముద్దుండు జీవించె చి
వకళన్ వ్రాసియు వీనిపుట్టువు కడున్ వర్ణ్యంబు మల్లేశ్వరా॥ 487

మ. తగులంబెట్టినఁ బాతిపెట్టిన మొగాల్ దగ్ధమ్ముగావించినన్
బొగచూరించినఁ గాటిలోనిడిన, "చీ? పో? నీచ? యన్చున్ ఘనుల్
వెగఁగాండ్రించిన బుద్ధిరాని ఖలులన్ దేవేశ? యే రీతిగాఁ
బొగ డేదింతువొ? నీకుఁ జెప్పవలెనే? భూతేశ? మల్లేశ్వరా॥ 488

ఉ. ఒకకొన్నాళ్లిది గ్రామదోష మని నే నూహించితిం గాని యీ
వెకలుల్ "దుర్బుగు" లంచెఱింగి పిదపన్ వీనమ్మనుం గ్రామ మా
త్మకుఁ దప్పబ్బ నటుల్ చరింపమి నిఁకన్ దద్దోష మంచిందు వ్రా
యక నీ దోస మటంచుఁ జేర్చెనెదఁ దత్త్వంబింత మల్లేశ్వరా॥ 489

శా. ఐదయ్యెన్ శతకమ్ము లట్టుడికినట్లై యెప్పు డింకెప్పు డీ
మా వర్ధ్యేచులు రూపుమాయు"నని గ్రామంబాగ్రహోదగ్రమై
నీ దిక్కున్ గనుచున్న దేకతమొకో? నీ వూరకున్నావు మ
ర్త్యావాహీనుల రూపుమాపుట యకార్యం బౌనె? మల్లేశ్వరా॥ 490

మ. అవమానంబులు లెక్కసేయ రని నీ యాంతర్యమే పూర్తిగాఁ
జవి చూచెంగద? యెంద తెన్నిగతులన్ "జాబాలు చీ చీలు, మున్
దవులన్ జేసిరి "దున్నపై చినుకులై" తత్సర్వముం బోయె ని
క్క వికి న్నికును దక్కఁగావలయు లోకఖ్యాతి మల్లేశ్వరా॥ 491

మ. ఇటుకల్ కాలిచి యమ్ముకో లనఁ గడున్ హేయాతిహేయమ్ము మా
రటకుల్ దీనికి నగ్గమై రిది మహారణ్యమ్మునం గావ సం

శఠ మీ మిష్కృతి గారిమమధ్యమునసే కల్పించినార్గోతు లె
న్నటికిం బూడ్చెదో ? యీ చరిత్రవిదు లానందింప మల్లేశ్వరా॥ 492

పు. మును పగ్గాధిజు యాగముం జెరిచి రమ్యార్ఘాగ్రిణుల్ పాతకా
లను శర్థించుటలోసుగాఁ గలుగు నైర్ల్యజ్జప్రయుక్తమ్ములౌ
ఘనకార్యమ్ములు మా యనామతరువుల్ గావించి రే తత్ఫలం
బును వీండ్రిన్ గుడిపింతువో ? గుడుపవో ! మోమోడి మల్లేశ్వరా॥

శా. మోమోడన్ బని యేమి నాకనెదో ? మా మూర్ఖాగ్రిణుల్ నీడు సం
గ్రామంబందున నర్పకాధమునకున్ దాస్యమ్ము గావింపుటన్
బ్రేమం బించుక నీకుఁ గల్గె నని యుత్ప్రేక్షించితిన్, ద్వత్ప్రథా
స్తోమంబుం బరియింప నిట్టి సొబగుల్ చూపట్టు మల్లేశ్వరా॥ 494

శా. విద్యాన్యక్కృతి, తద్ధధిక్కృతియు మా పిఱిండికుంకల్ సతం
బుద్యోగమ్ముగఁ గొంటకున్ ఫలము మూలోన్మూలనంబౌటయే
“సద్యంబో? యది వేఱొకట్టొ” యనినన్ శక్యంబె చెప్పంగ నా
పద్ముక్తిన్ ఘటియించి తీప వెపుడో పాపంబు మల్లేశ్వరా॥ 495

మ. విధవల్ లేరని కాదు గాని మఱి మా పిఱిండి కుంకమ్ములన్
బృథమోదాప్త్యతికై పతుల్గొడు జనింపం బోలు నేతాదృశం
బధమత్వ మ్మిఁక నొక్కచో నరయఁబో పంకుంక విద్యార్థులన్
పృథగాఁ పెట్టెడి వాని పొం గణపవే? విశ్వేశ మల్లేశ్వరా॥ 496

శా. కుంకల్ వెంకయు నీదు నగ్రిమునసే కూర్పుండి జూపంబు ని
శ్శంక పక్రియ నాడుచుండుటకు నే శ్వాంతమ్ము లజ్జింపదే
యింకన్ దైవము వెట్టు లయ్యెదవు నీ విప్రావులన్ నైఁచుచో
నింకింపంగదవయ్య ? శీఘ్రముగ మిష్కృత్యంభు మల్లేశ్వరా॥ 497

శా. జూపం బాడుట కూటసాక్ష్యములు పెత్త్వారిద్విషద్భావ మ
ర్యాదాధాపకృతఘ్నతాగరిమ ముఖ్యమ్ముల్ గదా ? ఏండ్రి స
ర్వాదాయమ్ములు జన్మకర్మములు నీ వర్జించి వర్తించుచో
బూడిదన్ జేయుట కేమి శంక యిఁక శంభూ? దేవ? మల్లేశ్వరా॥ 49

శా. నాగ్రిమస్థుల్ పరిహాస్యమానాశ్వపరిజయున్ గట్టింపఁగాతో దేమున
ట్లేమేమో చెడుకర్దమంబుల్ బలిపి యా యీ భీతి జీసత్పవ
వాగ్రిముఖ్యంబు వహించి యిప్పు డెవఁడున్ వా విప్పుటల్ లేమి,హో!
మోముల్ పూర్తిగ మాడెఁ గుంకల యశఃపుమ్ముల్ పండె మల్లేశ్వరా॥

మ. ఇఁక నిష్టే మనః పుప్పుడుంగయుతతో నీ నన్ను దూషించుచున్
వెకలుల్ గుంకలలోఁ ద్వితీయుఁడు రుషావేశమ్ము మైఁ గన్నుగా
నక పొంగున్ గడు జోరఁగిల్లఁబడెడున్, నా శిష్యుఁడై నన్నుఁ దా
నెకసక్కెమ్మటు లాడఁగొంకఁడో కదా! యీ శుంఠ మల్లేశ్వరా॥ 500

మ. గురునిం దూఱుట తండ్రిఁగొన్న నవలాకూటంబు గైకొంట,త
స్కరతాముష్కరతాకృతఘ్నతలలోఁ జాతుర్యముం గొంట,సు
స్థిర మశ్వత్థము దుమ్ముచెట్టుకరణిన్ ఛేదించుటల్ లోనుగా
మరితిమ్ముల్ పొనరించు దుర్భగులు పథ్యల్ గారె? మల్లేశ్వరా॥ 501

మ. గురునిం దూఱుట లోనుగా దొసఁగు లిక్కాలమ్ముల్ నిరాతంకము
ష్కరతన్ జేసి యొనర్చి రియ్యవి భవిష్యద్దుర్గతిన్ సర్వతః
పరిణామమ్మునఁ దెల్పినన్ గనక మా భగ్నాయతుల్ శిష్యు లేఁ
గురు నన్నున్ గురు వెక్కిరించెదరు గన్గోవయ్యా? మల్లేశ్వరా॥ 502

మ. నను దూషించుచుఁ జెప్పుపద్యమున నే నాశంబు మచ్ఛిష్యు నె
త్తిని నిల్పెన్ "కులనాశన" ధ్వనియు నర్థిన్ దానఁ దోతెంచె నా
శనకాలం బది దగ్గఱింబడుటయే సత్యంబు గా వచ్చు నూ
ద్యుని పైఁ జల్లిన ధూళి కన్నులఁ బడెన్ రోషించి మల్లేశ్వరా॥ 503

(పరోక్షజా ధాతులనాశనాదిమహిమాస్వాలము)

మ. మొదలంటన్ బరిభూతిసాగరమునన్ ముమ్మాటికిన్ ముగ్గి మా
వదఁబంటోతులు సిగ్గు లేమి మరలన్ వా విప్పుచున్నారు దు
ర్మద లీ తుంట లీ పరాభవములన్ మన్నింప రొక్కొక్కనిన్
దుదముట్టింప గదయ్య! శీఘ్రమెయి నుద్యోగించి మల్లేశ్వరా॥ 504

పద్దేశమ్ము నుతించుఁ గర్మ మది మర్యాదం బనంచన్న నా
పద్దెసంబవు కాకపోను విది దుష్ప్రఖ్యాతి మల్లేశ్వరా॥ 511

మ. అఖిల గ్రామముగూరె గుంక లతిమర్యాదాం లై యుంటచే
సుఖ మిహాంండ్రికుఁ గ్ను బొప్పను పాసుత్వమ్మె వాంఛించు నో
సుఖవిఘ్నాంక ! యట్టు లయ్యు "సుఖ మిమ్మా" యంటి "సర్వేజనా
స్సుఖినస్సం" తను మాట కర్థమును సంశోధింపు మల్లేశ్వరా॥ 512

శా. కొట్టం గూడను చేనినే నొకతఱిన్ గొట్టన్ బ్రసక్తించినన్
గొట్టన్రా న దరంబుమీఁద నని పాపిష్ఠుల్ వచ్చుమర్ సర్వథా
చెట్టల్ వీడఁగని నే నెఱింగియు నినున్ జేసాచి యాచించెద
న్నట్టేటన్ బడి మున్గు కుంక కనుదానం బిమ్ము మల్లేశ్వరా॥ 513

మ. మును పపోహితనరేంద్రు దౌష్ట్యమున భీముం డాగ్రహోదగ్రుఁడై
తన యశ్వమ్మును నీతఁ జేసి యొక పద్యంబల్లి జాఁదిట్టి పో
తనయర్థాంగి ననుగ్రహించి మరలన్ దాఁ ద్రిప్పె శాపంబు పో
తన జీవించె యశోధనంబు కవికిం దా నిచ్చె మల్లేశ్వరా॥ 514

మ. ఒకచో దుష్టుల దౌష్ట్య హేతువునఁ గోపోద్రిక్తులై సత్కవుల్
స్వకవిత్వమ్మలవాంద్ర నష్టికొఱకై సాఁగించియున్ వత్సలం
బు కడుం దాపగుపట్టునన్ సదయులై ప్రోవంగ నుంకించుచే
సుకవీశత్వపు గుర్తుగున్ మదిని సంశోధింపు మల్లేశ్వరా॥ 515

మ. నను నిందించునుగాక నా యెడలఁ బూర్ణద్వేషముం బూనుఁగా
కనయంబుల్ శత మాచరించి నను హేయాలాపముల్ గూయుఁగా
కను మోదించితి నంటి దప్పులకు నే నన్నింటికిన్ వీని దు
ర్జనతం జూడక మృత్యువున్ దొలఁచి సంరక్షింపు మల్లేశ్వరా॥ 516

మ. మొదలే లే వనుకొన్న నీదు కళ యిమ్ముర్గాత్ములన్ గట్టిగా
బెదరించెన్ బయి తేగనీకు మిఁక నా విజ్ఞప్తి మన్నించి యా
వదరుంబోతు ననుగ్రహించి యెటులో ప్రాణమ్ముఁ గాపాడు మం
త్యదశన్ ద్రిప్పుము నీకు నాకును యశం బార్జింపు మల్లేశ్వరా॥ 517

శా. తత్తోషదయ్యం దొనర్చె ము న్నెఱుంగవే? "తర్వాణి పద్దెమ్ములన్
వత్సా? తన్ముఖపద్యమం దొదవె మూర్ధాన్యనంబు. తద్దోష మా
పత్సంప్రాప్తికి మూల మం చనెదొ? యావద్దోషముల్ వాపి నీ
యుత్సంగమ్మున వీని నుంచికొని యాయు స్సిమ్ము మల్లేశ్వరా॥ 518

మ. ఎచట న్నన్ను నుతించువారె జగతిన్ "హీహీ"లు నన్ గూయు దు
ర్వచనుల్ గానఁగరాదు,వీండ్రి నెటులో రక్షించి నన్ వీండ్రు త
ద్రచనార్థం బుపయోగ మౌను.రది తద్దన్ నన్నుఁ బేర్రేచి ప
ద్యచయంబున్ భవదంకితంబుగను జేయంజేయు మల్లేశ్వరా॥ 519

శా. మీసాల్ దువ్వి కలార్థులన్ జెనకుచున్ మృత్యర్థమెంతేనియున్
జేసెన్ వీఁడు ప్రియత్న మయ్యది వెసన్ సిద్ధించు కాలమ్ముతా
నాసన్నంబును నయ్యె నట్టితఱి ని న్నర్థించితిన్ వీనికై
దోసం బున్నను సైఁచి మన్నితివి సంతోషంబు మల్లేశ్వరా॥ 520

శా. ఏ నీచుం డటు మిట్టిమిట్టిపడెనో యీ నాయెడన్ వాఁడిదే
పో నుండెన్ మఱి యొక్క యూరి కిచటన్ బో నానకున్ గాకొగిన్
''గానన్ లేక దురాయతుల్ చెడుట కెక్కష్టాత్ముఁడే సాక్షి యుం
చీ నిశ్శ్రీకు జనుల్ హసింతు రిఁక "హీ హీ "యంచు మల్లేశ్వరా.

శా. ఏ భూమిన్ గొని నెట్టిపంటకలహం బీ దేబె కల్పించె నో
యీ భూమిన్ గతిమాలి మొన్ననె సుమీ? యమ్మెన్ ఋణార్థమ్ముగా
నీ భాగ్యమ్మున కెందుకో గడ యటుల్ హేయమ్ములన్ గూయుఖల్
లాభం బిట్టిది యుండ నెట్టులు సుఖీలం బబ్బు మల్లేశ్వరా॥ 522

మ. ఘటియించెన్ స్థలభాండశుద్ధి తుదకున్ గ్రామానకున్ దూరమై
యెటకో పొట్టను జేతఁ బట్టికొని పోయెన్ గుంక, వెంకన్నసం
కటపా టన్న? నవర్ణనీయ మఖిలాంగ క్షౌరమే యయ్యె న
క్కుటిలున్ బాచకునింక నొంపవలయున్ గ్రూరాత్మ మల్లేశ్వరా॥

శా. వీనిన్ దుశ్చరితుల్ దురుద్యమ బలుల్ పీసంబు శిక్షింప వీ
హీనాలాపుని నోటికన్న మఱి యెన్నేరెట్లు విప్పింకెల

స్థానంబే బహుమానపాత్రి మిది తథ్యం బంచు నీ బుద్ధికిన్
గానన్ వచ్చియు నేఁడుకో గద? యుపేక్షాబుద్ధి మల్లేశ్వరా॥ 524

మ. త్రితయం బేర్పడె గ్రామమం దఘము నుద్దీపింప నందిశ్వరా
వెతలం గుడ్పితి గ్రామపాచకునకున్ వీసంబునుం గూడఁ బా
చితమున్ జేయవు వీని దుర్నయము నీ చిత్తానకున్ రాదొ; యి
ప్పతితుఁ గూర్చి యుపేక్ష సేయుట మహాపాపంబు మల్లేశ్వరా॥

మ. చదువున్ వీఁడు "పురాణ"మం చవల లజ్జాహీనతన్ జేసి యే
బెదరున్ లేక "తదర్థ" మఁచు నొడువున్ విద్వాంసు లా వీథిఁబో
వుదురేనిన్ మఱి కొంత బిఱ్ఱబిగియున్బో? "మీ యెడల్ భీతి నా
యెద లేశమ్మును లే" దటంచుఁ దెలుపన్ హీనుండు మల్లేశ్వరా॥526

శా. ఈ చండాలుని కంఠమాధురియు నీ హీనాత్మ వాగ్ధాటి, యీ
నీచాలాపుని యర్థవైఖరియు నీ వేనాఁడు నాలింపలే
దో చంద్రార్ధశిఖరణా? యొకింత వినుచో నుల్లమ్ములో మండి నీ
వే చెప్పం గొని చావఁ గొట్టెద వటంచే నెంతు మల్లేశ్వరా॥ 527

మ. "ఇది నా దస్కము రాఁ బ సే మటులు నీవే కొట్టఁగా రాదె యీ
వదరుంబోతు" నటందువేమొ,యురకే వాక్రుచ్చితిన్ గాని చె
ప్పెదలోఁ గొంకెడివీనిపైకిఁజన,నీ హీనాత్మ దాత్మీయదు
ర్మదమున్జేసియె స్వల్పకాలమున భస్మం బౌను మల్లేశ్వరా॥ 528

మ. ఇపు డీ గాడిదకొడ్కు బ్రాహ్మణుని.సొ మ్మేమంచు బెల్లమ్ముగా
నెప మేదో సృజియించి మెక్కెడినొకో?సి చెంక మా కుంకయున్
గపటుల్ బాసటగాఁగ, నిట్టిపనికిన్ గష్టమ్ము నీ చిత్త మం
దెపుడుం దోఁపదె?నిక్కముం దెలుపు మో యీశాన మల్లేశ్వరా॥ 529

శా. ఈ సొమ్మంట?త్వదర్థమై వ్యయము నా యీ తుంటరుల్ సేతురం
టీ సౌజన్య మెఱింగితే?యకట?నీ విద్దానిచే నెంత సం
తోసం బఁదెదొ వాం డ్రెఱుంగుదురు నీతో నాకు వా దేల? యీ
కాపున్ జేయని పాపకాధము నెటో గాఱింపు మల్లేశ్వరా॥ 530

మ. భూమిస్వామిద్విజుండు, గొల్లరయి, తమ్ముగ్రస్తున్ దురాలోచనా
కాముంగా నొనరించి గాఢకొడుకుల్ గాఁజేసినా ర్స్వామి,నీ
నేమంబుల్ మది నెంచి యే యగు నాకోః నేబానుః కైంకర్య మో
స్వామీఃనీ కెటువంటి దబ్బినదిః యాస్వాదింపు మల్లేశ్వరా॥ 531

మ. ముగురున్ గూడి యొనర్చు దుష్కృతుల నామూలమ్ము నీ చిత్త మె
క్కఁగ నేఁ జెప్పితి నందు నిర్వర నొగిన్ గారించి తప్పాచకున్
బాగ రేదింపవు.వీడు దీనుఁ డనియాఃము న్నట్టేఁడే యయ్యుదు
ర్భగుఁ డిం కీవృథుఁ డుండఁ బోఁ డనుచు సంభావింపు మల్లేశ్వరా॥ 532

మ. కల రెండున్ మొగ మెల్లఁ బేరితకళగాఁ గన్పట్టు దుష్పాచకుల్
ఖలు లామాత్రిముచేతఁ గారు మన యీ కళ్ళన్నగాఁ డన్ననోః
పలుగుంగాడిదకొడుక్కు, వీని ననుకంపన్ జూడఁగారాదు చి
క్కులపాలున్ బొనరించి కర్మఫలమున్ గుడ్పింపు మల్లేశ్వరా॥ 533

మ. నలుగన్ దన్నెద మందుర్రి శిష్య లచట స్నాయాజ్ఞ లేకుండె నీ
యలఁతి న్నీవు నుపేక్షచేసెదవు, దుర్వ్యాహారుఁడై వీఁడు దు
ర్మలినంపున్ మరణంబు వాఁతఁ బడు నమ్మాడ్కిన్ దెగన్ బ్రేలుఁ డ
త్ఫల మైనన్ గుడిపింపు శీఘ్రిముగ విద్వద్వంద్య మల్లేశ్వరా॥ 534

శా: మీసాల్ దువ్విన దున్నపోతు కొడుకున్ "మీఁదెట్టు క్రిందెట్టుగాఁ"
జేసెన్ గ్రామము వెల్వరించె మఱి తజ్జ్యేష్ఠున్, మఱిన్ లెంకనో
పైసాకున్ గతి లేక యేడ్చుగతిగా బాధించె నేహేతువోః
దోసంపున్గనిఁ బాచకున్ మిగిలిచెన్ దుర్వృత్తి మల్లేశ్వరా॥ 535

శా. ఇంకన్ నిండవా వీని దుర్నయము లీ యేవంపుఁ బెన్గుట్టకున్
బింకంబే యభివృద్ధి కారకమొః యిప్పాపుండు శ్వానంబు, నీ
లెంకన్ గుంకను బైని జూచికొని యెల్లేఁ బేరిలుటన్ వీండ్రినే
యింకింపన్ దొరకొంటివోః తెలుపు మో యీశాన మల్లేశ్వరా॥ 536

శా. లేశం బేనియుఁ బాపభీతి మదిలో లే దీ దురాచారు నం
దీ ఖంతన్ మడియింపఁగా వృథగ నీ కే లయ్యెః సందేహమో

యీశా? మూగురలోన నిర్వర నెటో యింకించి తీ దుర్వచః
కోశు న్నాశ మొనర్చి పేర్గానుము లోకుల్ మెచ్చ మల్లేశ్వరా 537

శా. ఈ లంఁజీకొడు కెంత దుర్భగుఁడో నీవే చూడుమా భూమి తా
నేలా స్వీకృతి చేసె ? గొల్లఁ డెవఁ డా యీ బ్రాహ్మణార్థమ్ము తా
నీ లుంటాకున కమ్మి వేయుటకుఁ దా నెవ్వాఁడు కైకొంటకున్
గాలుష్యం బిది చాలదే? ఖలు నడంగన్ జేయ మల్లేశ్వరా॥ 538

మ. అపవిత్రున్ రిపుఁ బాపుమాపుటకు నీ వాలోచనల్ సేసె దీ
శ్వపచాకారుని మోర చూచునెడఁ బాపం బబ్బునో లేదొ నీ
వ పరీక్షించి వచింపు మిట్టి ఖలు నేలా నీవుపేక్షించె దీ
కృపణున్ శిక్షకుఁ బాత్రుఁ జేసి వెసఁ గీర్తిం గొమ్ము మల్లేశ్వరా॥

శా. కుంకల్ పూర్తిగ మాడిపోయిరి యవాకుల్ పేలి పేలించి నీ
వెంకో? సర్వవిధమ్ములం జెడి సురాశింపంబడెన్ బాచకుం
డింకన్ రూపఱలేద వీని కొక లెక్కే? యూరి చీవాటు లీ
అంకుంగాడిద కెట్టిశాస్తియు నపర్యాప్తంబ మల్లేశ్వరా॥ 540

శా. ఎంతో కాలము పట్టునంచు మదిలో నే నెంచితిం గాని య
త్యంతక్షిప్రగతిన్ నశించిరి రిపుల్ ధర్మేతరారంభులై
వాంతుల్ చేసిన పాచకాపశదు దుర్వక్త్రాన కన్నోదకా
క్రాంతిన్ దూర మొనర్పవేని నిను నేఁ గైకోను మల్లేశ్వరా॥ 541

మ. ధర "నత్యుత్కట పుణ్యపాపములకున్ దత్తత్ఫలావాప్తి చే
కుఱు నీ లోకమునంద" యన్న నుడి మా కుంకమ్ములందే కడుం
జరితార్థమ్మటు మిట్టిమిట్టిపడి నిచ్చల్ కూటికిన్ గుడ్డకున్
గఱవై పోయిరి శీఘ్రకాలముననే కన్గొమ్ము మల్లేశ్వరా॥ 542

శా. ఏ గుర్కుంకలుగూడఁ "జెట్టుకొకఁ"డై రిల్వెట్టె నొక్కండు మా
రోగుం డొక్కరుఁ డమ్మె వీఁడు మిగులన్ గ్రూరుండు కుంకల్ మ త్రీ
లాగే నేఁడు స్వయంకృతాఘముల వాలాయమ్ము డీలైరి, తా
మాగం డింతకుఁ బాచకుం డఘములన్ మ్రగ్గండు మల్లేశ్వరా॥ 543

మ. తల కొక్కొక్కరుగ గుంక లేసుకతనన్ దారిద్ర్య మీ యూరికిన్
దొలఁగెన్ బాచకగార్దభం బొకరుఁ డించున్ బాతుకున్నాఁడు క
శ్మల మివ్వాని మొగంబు చూడఁ జన దీ చండాలునింగూడ న
వ్వలికి న్నెట్టితి వేని గ్రామమున కా భద్రంబు మల్లేశ్వరా 544

శా. పిక్కల్ నాలుగు గాడ్దకొడ్కున కెటో పిత్రార్జితం బబ్బె నా
రొక్కం బుంట మఱింత హెచ్చి ముదిరెన్ రోగంబు నానాఁటి కీ
కుక్కన్ బెల్లుసి కొల్పినట్టి ఖలులన్ గూపెట్టఁగాఁ జేసి తే
లొక్కోఁ? యీ జననిందితున్ విడిచి తోహో? దేవ మల్లేశ్వరా 545

శా. నీ తాత్పర్యము "పేరకత్వమె కడు న్నింద్యంబు కాఁబట్టి యా
చేఁతన్ జేసిన కుంకలెంకల నొగిన్ జీవచ్ఛవత్వంపుఁ బె
న్గోతం బూడ్చితిఁ జాలు" నంచుఁ గలదో? కూరాత్ముఁడీ నీచునీ
వీ తుచ్ఛున్ మథియింపఁగావలెఁ జుమీ? యెప్టేని మల్లేశ్వరా॥

శా. కుంకల్ నాశన మొందకున్ సకలలోకుల్ గూడ మోదంబుతోఁ 546
జంకల్ తట్టుచునుండి రీ జడుఁడు దుస్సంచారియై లేశమే
నింకంబాఱమి కెల్లరున్ గనలి నిన్నేమందురో నీ మనః
పంకేజమ్మునఁ జూచుకొన్నయెడ విస్పష్టంబ మల్లేశ్వరా॥ 547

శా. ఏ దే నొండు గుణంబు చూపిన సరే యీతుచ్ఛునం దట్టులే
కా దే నిజ్జ మసిచేసినన్ సరియె యీ కష్టాత్ము దుర్వ్యక్తికిన్
బా దైయుండియుఁ దత్ఫలం బనుభవింపంబోక యీ దేబె నిః
షేమం దొసెడలేఁడు దేవుఁడనరే? కీడెంచు మల్లేశ్వరా॥ 548

శా. తప్పుల్ లోకమునం దనేకము లసత్యంబున్ గృతఘ్నత్వమున్
గొప్పన్ గొంచెముఁ జూడ కూరక యవాకుల్ పేలుటల్ లోనుగాఁ
దప్పుల్ మిక్కిలి పెద్ద వీ జడున కే తద్దోషమే విస్తృతం
బిప్పాపున్ క్షమియించి తేమి కతమో యీశాన? మల్లేశ్వరా॥ 549

మ. ఎపుడు న్నోట నమంగళంపునుడులే యీ దేబెకున్ వచ్చు నే
నిపుణత్వంబును లేక యుండియుఁ గడు న్నిక్కున్ దెగన్నీల్గు నీ

శ్వపచుం డాడెడి మాటలందుఁ గల దౌర్భాగ్యంబు నేనీ గత
త్రిపుఁ గుడ్పింపుము దాన వీ డుడిగెడిన్ ధార్ష్ట్యంబు మల్లేశ్వరా॥ 550

శా. నా కాశ్చర్య మెలర్చు 'నే' ననినచో నమాత్రితనమ్ముండుగా
భీకంపమ్మున మూలలం దొదుగు నీ పెందేల దేవయ్యా నేఁ
డీ కుంకమ్మల పేరిరణమ్మున ననున్ హేయాతిహేయమ్ములా
వాకుల్ దోఁకెడి పీని మాపని కవిత్వం బేల ? మల్లేశ్వరా॥ 551

మ. కపనం బస్న దురాత్మునిం గెడప యోగ్యాగ్రిమణిన్ బెంపఁగాఁ
బవి పీయూషము నై చెలంగు నెడలన్ భాషావిదగ్రేసర
స్తవ పాత్రం బగు నెట్లొ కష్టపడి పాగ్రిసల్ విశ్రమంబుల్ పొరిన్
దవులన్ గూర్చిన యంతమాత్రన కవిత్వం బౌనె మల్లేశ్వరా॥ 552

మ. కవ కీ యూ రొనరించు పుణ్యమునఁ గుంకల్ పంచబంగాళమై
యెడఁగాఁ బోయిరి భూము లమ్మికొని యుందే యుండెఁబో? లెంక తా
నడుగంటన్ దెగమాడి పాచకుఁడు సాహాయ్యమ్మిటుల్ వోయి పే్రి
లుడు చాలించెను బ్రిస్తుతం బొదిగి జాల్మం డయ్యె మల్లేశ్వరా॥ 553

శా. ఈ మాత్రమ్మున "వీఁడు యోగ్యుఁ" డని నీ వేలా గుపేక్షించి త
య్యో? మూఢుండు దురాశయుండు దురితాయుష్కుండు దుశ్చేష్టుఁడీ
ధూమాస్యుం డతినీచుఁ డిచ్చెనఁటి కేదో శిక్ష గావించి మ
త్సామర్థ్యమ్మునకున్ ఘటింపుము జగత్ప్రఖ్యాతి మల్లేశ్వరా॥ 554

మ. "ఎనఁ డిచ్చో?" డల వేంకటేశ్వరకవిన్ హీనోక్తులన్ గూయుదు
ర్నృపుఁడీ దుర్దశకేమి కారణము ? దూరం బారయన్ లేక య
క్కవిపై కేగుట గేలిసప్పుడు యిటుల్ ఖండించి యాబాలమున్
గవితాగోష్ఠులయందుఁ జెప్పికొనఁగాఁ గావింపు మల్లేశ్వరా॥ 555

మ. దొసఁ గిచ్చాని డుపేక్ష మెట్టులగు ? నీ దుర్మార్గుఁ డావంతయున్
గసుగందండు సహాయులో చెడిరి దౌర్గత్యమ్ముపాలై చెడుం
గసరుల్ దిట్లును నూరిజేఁ దినియె నీ కంకోష్ఠ మీ తిట్లు లి
క్కనవున్ మేసెడి కాఋదున్నకొక లెక్కా? తెల్పు మల్లేశ్వరా 556

శా. వేదాంతమ్ముల నెంచిచూచిన రుడావిర్భూతి తప్పే నిజం
బీ దుర్జాతు దురాగతమ్మునెడ నాకే కాదు నీకేనియున్
రాదా? క్రోధము మిట్టిమిట్టిపడదే నీ రాండేయుఁడా మిట్టిపా
టా దుర్భాషలు నూరకే చనుట యన్యాయంబు మల్లేశ్వరా॥ 557

మ. కవియన్నన్ ఋషియంశమే కద? ఋషుల్ కంకోష్ఠులన్ మాపఁగా
స్వవివేకమ్మున కీడుగానిరుషతో సాంగత్యముల్ నేసి రం
చవలోకింతుము గ్రంథరాజములలో నస్మాదృశుల్ క్రోధమున్
దవులన్ చెప్పెటు లయ్యెడిన్ గుజనులన్ వందింప మల్లేశ్వరా॥ 558

శా. స్వగ్రామమ్మది నాకు నిందుఁ జిరవాస్తవ్యున్ మహీయః కృపో
దగ్రస్విన్నిన్ గుతిచేసి యింతదనుకన్ దాత్పర్యపర్యాప్తిమై
నే గ్రంథమ్ము రచింపలే దనెడి యా యీ లోపమున్ దుర్గుణ
వ్యగ్రుల్ తీర్చిరి కుంక లెంక లిది సత్యార్థంబ మల్లేశ్వరా॥ 559

శా. శాపార్థమ్మది పుట్టి దేవునకు నీషన్మాత్ర సంబంధమే
యీ పద్యమ్ములయందటన్న నిజమే యీ పొత్తమే కాదు ము
న్నే పొత్తమ్మునఁగూడ దేవునకు నింతే గోప్యత ప్రాయమై
యాపాదించు నిదే పవిత్రతను గావ్యం బెల్ల మల్లేశ్వరా॥ 560

శా. సంకల్పించితి నీ నిమిత్తమున నీ సత్కావ్య మల్లంతలోఁ
గుంక ల్లెంకయుఁ బాపకాపకదుఁడున్ గోపంబు హెచ్చించి బల్
పంకంపుంబను లాచరించి రటుపై వర్ధిల్లె భావత్కమా
మాంకం బూరకపోదు వృద్ధి కిరవై వ్యాపించు మల్లేశ్వరా॥ 561

శా. ఇందున్ జాల్ముల దుష్టచేష్టల నెటో క్లిష్టోక్తిఁ జేసి నే
ఛందోబద్ధముగా నొనర్చితి ద్విషత్సాహాయ్యమే లేనిచో
వంచే కా కిటు షట్పతంబు వఱకున్ వ్యాపించునే పద్యముల్
ఛందోభాషల కేమి శత్రుకృతమే సర్వంబు మల్లేశ్వరా॥ 562

మ. అగుదు న్నేను మహోశుధారకవితావ్యాసంగి నట్లయ్యు య
త్నగతిన్ జెప్పెడుపట్ల నిక్కమ సుమీ? నాతండ్రి? వాక్రుచ్చెదన్

బగలున్ రేయియు నొక్కపాపమునకే పట్టున్ ద్విషద్దుష్కృతి
స్థగితం బియ్యది వీఁడు కేవలనిమిత్తం బింయ మల్లేశ్వరా॥ 563

మ. సుతుసారోగ్యము సంస్కరించినది నీ శుద్ధాంత మీవో? మహా
పతితాపాయ పరామయమ్ము కతనన్ బాధైన గ్రామంబు సం
స్కృతమున్ జేసితి వింపుమింపుగ నిఁకన్ శేషంబు నిల్లైను సం
స్కృతమున్ జేసితి వేని గ్రామమున కౌ శ్రేయంబు మల్లేశ్వరా॥ 564

శా. ఈ కుంకమ్మలు గ్రామమున్ విడచి రెం కీపై దురంతమ్ములౌ
పోకల్ వీడుడు రంచు సంతసిలి రావ్పుల్ కుక్కయొక్కంట గౌ
రీ కళ్యాణము పాడునే? యపటి చార్జీలంపు దుష్కూటపున్
సాకిర్లీ చెవలమ్మలే యెఱుఁగు మీ చందమ్ము మల్లేశ్వరా॥ 565

మ. కవిరాజీగతి వ్రాసె ధర్మపదుఁడౌఁగా? సూర్యనారాయణ
ప్రవరుం డాగతి వ్రాసె పేంద్రయెడలన్ వా రేల ద్వేషింతురో!
శివ? నీవే పరికించి యీ చెనఁటులన్ జేడ్పాటులన్ ముంచి స
ర్వవిధాలన్ ఖ్యాతి గూర్చి మాపుటయె కర్జంబయ్యె? మల్లేశ్వరా॥ 566

మ. అపసాక్ష్యమ్మును లెంకయన్నకొలుకై న్యాయాధికార్యగ్రిమం
డుపదపాప్య మొకింతయుఁ గనక యాయుఃకార్యమున్ జూడ కీ
విపరీతుల్ మన కుంక లిచ్చిరి గదా? విశ్వేశ? యీలాటి దు
ష్కపటుల్ వర్తిలు చోట సజ్జనుల కస్వాస్థ్యంబు మల్లేశ్వరా 567

శా. ఎన్నో దుష్కృతులం బొనర్చి తుదకా యీ యూరికిన్ దూరమై
యన్నార్థం బొక గేస్తువింట శునకంబై యుండి యేవం విధా
పన్నత్వమ్మున మ్రగ్గి పాడఱియు మా భ్రష్టుండు దుస్సాక్ష్య మం
దన్నన్ జంకఁడు వీనిపుట్టు పతివర్ణ్యం బయ్యె? మల్లేశ్వరా॥ 568

మ. అన్నృతంబున్ వ్యభిచారమున్ మఱియు మద్యాసక్తి యీ మూటికిన్
మనుజుం డెంతయు దవ్వుగాఁ జనవలెన్ మన్నించుచో నొక్కమా
అనుమానింపఁ డిఁకెన్ని మార్లయిన నీ యల్పాతుఁ డిట్లేసుమా?
జననింద్యం బపసాక్ష్యమున్ బలుకఁగా జంకండు మల్లేశ్వరా॥ 569

మ. అనృతంబాడెడి దేబెకన్న ననృతం బాడంగ బేరేచు దు
ర్జనమూర్ఖన్యునకన్న నిక్కమెవలోఁ జర్చించి శోధించినన్
"నిను దూషించుట యుక్త"మంచుఁ దలఁతు"న్నేనెందుచేఁ"నన్న స
ర్వనియంతృత్వము నీది యీయఘము నిన్ బాధించు మల్లేశ్వరా॥ 570

మ. సకలాధీశ్వరుఁ డైన కృష్ణునకు ఘోషం బెట్టులో యట్లె నీ
కొకయీయూ రగుఁబాల్య మిచ్చుటి యయోగ్యుల్ యోగ్యులు న్నీయకీ
ర్తికి సత్కీర్తికిఁ గారకుల్.గనుక నిన్ దీవింప నుంకింతు రీ
ప్రకృతాఘమ్ము నెడఁ బ్రజల్ తెలిసియే పాలింపు మల్లేశ్వరా॥ 571

శా. రాజుల్ రాష్ట్రకృతాఘభోక్తలు,భవద్రాజ్యంబు మా గ్రామ.మెం
తే జాగ్రత్తగ లోకముల్ మనుచు నీ కీ యూరెటుల్ భార మౌ
భ్రాజద్రాజశిరోవతంస!సరిగాఁ బాలింపు,లేకున్న పో
నేఁ జెప్పన్ పని లేదు లోకులు నినున్ నిందింత్రు మల్లేశ్వరా॥ 572

శా. ఏకర్మమ్మొనరో యెఱుంగ నకటా!యెన్నో పొలా లుండి సు
శ్రీకంబుల్ పలుపంట లుండియును వానిన్ బొల్చునే ప్రాక్కడే
నీ కానంబడఁ డీ భవస్థలమునై యేపాటు మా పాటియుం
దే కుగ్రామము దీనికన్న నెఱుఁగే నుప్పుట్ల మల్లేశ్వరా॥ 573

శా. "ఈ నీచాత్ముల కారణంబుననె యీ కిల్బిష్యఁ బా" ల్పొందునే
నీ నక్కల్ జనియించి యెన్నెనె కటా!యెన్నో తరాలమ్మె నూ
రే నిశ్శ్రీకతటన్ గడంగి, యెవియో హేత్వంతరం బుండెడిన్
దాని న్నీవు దొలంచి ప్రోవఁ దగదే? తత్త్వజ్ఞ మల్లేశ్వరా॥ 574

శా. గ్రామక్షేమముఁ గోరి సారెకు నినుం బ్రార్థించెదన్ దేవ! త
త్క్షేమం బెప్పుడు సిద్ధమౌ నపుడె మత్క్షేమంబు సంసిద్ధమౌ,
స్వామీ!దుష్టుల శిక్షయున్ మఱియు శిష్టవ్రాతసంరక్షయున్
సామాన్యమ్ముగ నీ ద్వయంబె జగతిన్ శాసించు మల్లేశ్వరా॥ 575

మ. పదియున్నాలుగులోకముల్ మనుచు నీ ప్రాగల్భ్య మీ యూరికిం
గడు రేర్పర్చఁగఁ జాల దంచు మది నాకుం దోఁప దీ యూర దు

ర్మదులున్ మిక్కిలి లేరు వాండ్రి నెటులో మాయించియే యుంటి వీం
కది నా కోరికి గాదు గ్రామమునకున్ హా యిమ్ము మల్లేశ్వరా॥ 576

శా. చాతుర్వర్ణ్యముగూడ సంపదలతోఁ జక్కంగ వర్ధిల్లి ప్ర
ఖ్యాతిప్రాపక మైన కార్యములయం దాసక్తి రెట్టించి స
త్కీర్తిన్ భారముగాఁ ధరించుచునెడల్ శ్రీయుక్త మై యొప్పుతో
నేతద్గ్రామము నానమాన మను నం చే నెంతు మల్లేశ్వరా॥ 577

శా. శ్రేణుల్ రెంటికి ని శ్లోకం బయి బుధాభీష్టారమై బ్రాహ్మణ
శ్రేణింబై చను విస్తరించు లనమే నాసక్తిఁ గైకోక య
వ్వాణీభక్తుల గేలిఁ గొట్టెడి ద్విజవ్యాధుల్ ప్రకోపించుచో
రాణన్ బొల్చునె యెట్టియూరు నగజాప్రాణేశ? మల్లేశ్వరా॥ 578

శా. వాలన్‌వట్టు దురాగతుల్ చెడిరి నిస్సందేహమే కాని వి
ద్యాలోల్యమ్మునఁ బొల్చు బ్రాహ్మణులు లే రక్కారణంబై యుటన్
గాలక్షేపము సాధుసజ్జనులకున్ గష్టమ్ముగాఁ బోవు నీ
పీ లోపమ్ము హరించి గ్రామమును బై కెక్కింపు మల్లేశ్వరా॥ 579

శా. అంతో యింతో యనాది మా కులమె విద్యాభాగ్యసంపన్నతా
క్రాంతంబై యలరారుచున్నది భవత్కారుణ్యమున్ జేసి, యా
వంతేనిన్ జదువం దెఱింగిన మనుష్యప్రాణి యిం దెందు లే
దెంతో కష్టము కాదె? విద్యగలవాఁ డింపుంట మల్లేశ్వరా॥ 580

మ. చదువన్నన్ మనవేదశాస్త్రములు, తత్సంస్కార మీ యూరిలె
క్కడి దేమీ? యల స్వర్గలోకమునయం దైనన్ గనన్ రాదు. శ్రీ
స్తుదశన్ వేదము పురాణవిద్యయె, తదౌత్సుక్యమ్మునున్ లేని యూ
రిది, యే రీతిని బాగుఁజేసెదవొ? నీ సిద్ధాని మల్లేశ్వరా॥ 581

శా. “ఏలాగేనియు బాగుఁజేయవలె” నం చీ వెంచుచో వెంటనే
శ్రీలున్ సంపదలున్ బ్రతిష్ఠలమునన్ జెల్వారు నల్లంత వా
జీలాస్యోత్సవములు నుప్పతిల్లఁ బొడఁగున్ నీ పూజయున్ జక్కఁగా
వాలాయ మ్మగు గ్రామ మక్కతమునన్ వర్ధిల్లు మల్లేశ్వరా॥ 582

మ. భవదంఘ్రిద్వయపూజనంబును సరస్వత్యంచితం బైన వై
భవమున్ గల్గినచోట నెయ్యెడల దౌర్భాగ్యాలవాలమ్ములౌ
నవివేకుల్ తలలెత్తలే,రెటులనోహమ్మాటి జీవచ్ఛవ
బ్రువు లై పోయెద రర్కు ముందటి తమంబున్ బోలె మల్లేశ్వరా॥ 583

శా. న్యాయాన్యాయవిచారణల్ నెఱపి యన్యాయమ్ము శిక్షించు వా
రే యూరన్ వసియింతురో యచట దుష్కృత్యమ్ములన్ జేయు రాం
డ్రేయుల్ నిల్వఁగలే రెటో నిలిచినన్ దేజంబుతో నుండఁబో
రీ యూ రట్టిదిగా నొనర్పవలె నీ వీ పైని మల్లేశ్వరా॥ 584

మ. అవశిష్టంబగు పాపకాపటము దౌరాత్మ్యంబకున్ గూడ నీ
భవమందే ఫలమున్ ఘటించితివి తత్పాపిష్ఠతం బట్టి నే
నవిభక్తుం డటుగాక యుంటి నిపు డజ్ఞాలమ్మంతు కాల్చుంచిపై
నవయున్ జూచుట కష్ట మయ్యెడిఁ జుమీ నా కేమొ మల్లేశ్వరా॥ 585

శా. ఆపత్తుల్ పలుకేత రెల్లరకుఁ బర్యాయమ్మునన్ గల్గుచో
చూపట్టున్ సుకృతాత్ము కట్టికిఁ దుష్టుల్ చింత సూడింత్రు మ
ర్త్యాపాయన్ గని వారి చెట్టరసమున్ వర్ణించి హేతుత్వముం
దాపాదింతురు ప్రస్తుతం బటులె సంప్రాప్తించె మల్లేశ్వరా॥ 586

మ. ప్రతివాఁడున్ సుఖ యౌవనున్,వెరలకున్ బాలాటకున్ రెండె స
న్మతియున్ దుర్మతియున్,ఘనాశయుఁడు నేమం బందఁగాఁ బోఁడు స
న్మతి యేనాఁటను బాడుగాఁ,డిడియ యామ్నాయంబు సర్వత్ర సం
డితనమ్ము౦ దల కాళిదా సిటులె పాడెం బాడి మల్లేశ్వరా॥ 587

మ. అరి నేనిన్ జెడుబుద్ధిలోఁ బొనిపి పావౌనట్లుగాఁ జేయ కే
డ్తెఱ సద్బుద్ధి నొసంగి బాగుపడునట్లే సల్పు మోదేవ!నా
కరియౌవానికిఁగూడ నిట్టి ఫల మీ వర్పించుచో లోకు రె
ల్లరు నన్ మెత్తురు నా కిదే పరమ మౌ లాభంబు మల్లేశ్వరా॥ 588

శా. నా కావ్యంబుకతానఁ జెట్టు కొకఁడై నానాఁటికిన్ దీనుఁడై
శోకం బందుటకన్న శత్రువయినన్ శ్లాఘ్యుఁడై దాన సు

శ్లోకుల్ మెచ్చెడిచొప్పు గైకొనినచో స్తుత్యర్హ మం చెంచెదన్
నీ కారుణ్య మొనర్పరేనిపని యున్నే? యెందు మల్లేశ్వరా॥ 589

శా. ఏఁ దెవ్వాఁ? డల వేంకటేశ్వరకవిన్ వేమారు దూషించి పై
మోసై నాడటి పాడుమాటి తుదకున్ ముమ్మాటికిన్ యోగ్యుఁడై
క్రీడాపాత్రుఁడు గాఁగ మాఱె, ననుచున్ విజ్ఞుల్ ప్రసంగించుచో
వేఁదంగాఁ బ్రయతింతు నాకు నదియే వేయార్లు మల్లేశ్వరా॥ 590

మ. ఒకచేమాట సుబుద్ధిలేనియెడ నేయోగంబు నీ విచ్చినన్
సకలంబుల్ వికలంబ, సన్మతికి నైశ్వర్యంబు జోడించి త
క్కక మా గ్రామము బాగుసేయుము వృథాకంకోష్ఠులన్ వృద్ధిసే
యకు మయ్యా చెడుపేరు గ్రామమునకౌ నద్దాన మల్లేశ్వరా॥ 591

మ. ఇది విన్నాఁడవొ లేదొ? మున్ను తమకై యెవ్వాఁడు తా త్యాగమై
వదరెన్ వాఁ డెటువంటి వాఁడయిన యావజ్జీవ మవ్వాని యం
దు దయన్ జూపుట పాడి కుంకలకు మాదుర్మార్గుల ప్రాపకున్
మద మాఱన్ బడఁదన్నుఁ టూని రిది వో మా పాడి మల్లేశ్వరా॥ 592

శా. గ్రామం బిట్టిది యెట్టిదైనను సిరుల్ గల్పించి రక్షించుటల్
నీ మాహాత్మ్యపు గుర్తు తుచ్ఛులయెడ న్నేరంబులం జూతురే?
సామాన్యుల్ బలె నున్నతుల్ మనుపు రక్షస్సంతతిన్ మన్పరే
దే? మే మంతకు నెక్కుడౌ ఖలులమే? దేవేశ? మల్లేశ్వరా॥ 593

మ. పొరపొచ్చెమ్ములు మాకు లేవనను దప్పుల్లేవు మాయం దటం
చ జవన్ జాలిన యంత సాహసము లే దట్లయ్యు మా గ్రామమున్
బొరపిపైన కతాన నేదయిన నీతో మొఱ్ఱవెట్టంగఁ జే
కుఱు భాగ్యోదయ మంచు పారెకు నిటుల్ పోషింతు మల్లేశ్వరా॥ 594

మ. ఖలులై భావి దశా విపాకమునఁ గుంకల్ తీరి కూర్చుండి నా
చెలిమిన్ గోల్పడి నామెడన్ వృథగ దుశ్చేష్టల్ ప్రయోగించి నా
ముల పాలై చెడి రన్నవస్త్రములకున్ భూతేశ? నే నేల నా
వలె నీ కస్తినిమిత్త మీ హతకులన్ బాలింపు మల్లేశ్వరా? 595

మ. మగ లజ్ఞానము కల్మి నా యెడ వృథా మాత్సర్యముం బూని యీ
వసుఁబాటుంగతి దెచ్చి రంచు మగువల్ నన్ గూర్చి శోకించు న
ప్పగ నాకున్ రుచియింప దాసతుల సంభావించి యీ దుంతలన్
బాగులన్ జేయకు మింక నీకుఁ గలుగున్ బున్నెమ్ము మల్లేశ్వరా॥

మ. పోఁతులన్ జేయక యున్న వీండ్రు మరలన్ బోఁటెక్కి దుశ్చేష్టలన్
వెగఁ గావింతు రటందువో? సలుపనీ దేవేశ? మశ్శీఖరల్
బాగ రొక్కప్పుడు వీడునే? యిపుడి టుల్ పొల్పాటి జీవచ్ఛవ
త్వగతిన్ గాంచియు వీడరే? సహజ దుర్దర్పంబు మల్లేశ్వరా॥ 597

మ. స్వాకృతాఘమ్మునఁ బాతువాఱు ఖలులన్ సంపన్ను లేక్షించి తా
మెకసక్కెమ్మొనరింప రోపుగతి నెల్లే సుద్ధరింపంగఁ గొం
చొక యత్నం బొనరించి చూతు రనియే యుక్తంబు కాఁబట్టి వీం
డ్రికనైనన్ మేలయి వేడఁగా వలసె కర్మాణికిన్? మల్లేశ్వరా॥ 598

మ. శివనామంబు శివాంగనామణియు నీచేఁ జక్కెన్ నీకన్నవై
భవ మేవేల్పుల కున్నదిష్టి నిను సంభావించితిన్ గైతవే
శివమస్త్వస్తు శివం శివంభవతుమే చేతస్సు శంభో శివం
శివసంకల్పక మస్తుసత్యమపి మే శ్రీరస్తు మల్లేశ్వరా॥ 599

—/ గద్య /—

ఇది శ్రీ వేంకటకవీంద్ర ఘటాపంచానన విద్వత్కవి సార్వభౌమ
కళానిధి బాలసరస్వతి శతావధానిత్యాది బిరుదాంచితు
లైన శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులలో నొక
రును — కళాప్రపూర్ణులును — ప్రథమాంధ్ర
ఆస్థాన కవితా పట్టభద్రులును అయిన
చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి శతావధానిగారిచే
రచింపబడిన శతకము
మల్లేశ్వర విజ్ఞప్తి సంపూర్ణము
మల్లేశ్వరార్పణమస్తు!
ఓమ్ తత్సత్

# ★ ముఖ్యమైన సవరణలు ★

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు | పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 7 | 1 | స్థల | స్ఫల | 30 | 20 | గాఢ | గాఱు |
| 10 | 18 | మయ్యో | మ్మయ్యో | 40 | 19 | ఘమె | ఘమ్మె |
| 11 | 21 | పీడు | పీడు | 44 | 4 | ద్వధి | ద్వ్యధి |
| 12 | 12 | యుని | యది | 45 | 2 | నటు | నట్లు |
| 13 | 19 | గ్రాప్తిస్ | ప్రాప్తిక్ | 46 | 18 | డియు | డియున్ |
| 15 | 5 | వండి | పండి | 49 | 3 | పిల్లలస్ | పిల్లల్ |
| 18 | 19 | మ్యుక్ | మ్యుల్ | 50 | 11 | గుంలెతే | గులెంతే |
| 19 | 4 | వెంక | రెంక | 54 | 1 | దురం | దురారం |
| 19 | 10 | నినబూ | బూనిన | 55 | 19 | మమ | మ |
| 19 | 22 | సిప్ప | నిప్ప | 65 | 4 | లైయిన | లైన |
| 20 | 6 | గ్ఫంగుక్ | గ్ఫంగుల్ | 65 | 24 | పఁగ | పంగ |
| 20 | 7 | వులున్ | వులుర్ | 70 | 20 | టంబె | టంచె |
| 20 | 8 | మొక్కుటన్ | ముక్కుటల్ | 76 | 19 | ద్రాభత్వ | ద్రాభత్ర |
| 21 | 16 | ప్రాప్తి | ప్రాప్తి | 77 | 24 | లనజ్ఞా | లానలజ్ఞా |
| 21 | 26 | ఉవయ్యా | వయ్యా | 79 | 1 | ఖమ్ము | ఖము |
| 22 | 7 | తుడం | తుండం | 79 | 23 | ములున్ | ములక్ |
| 22 | 21 | న్పృశ | స్పృశ | 80 | 19 | దల్వా | వల్వా |
| 23 | 12 | రమ్ము | ష్మమ్ము | 81 | 22 | దద్ది | ద్ధి |
| 24 | 7 | మటంటన్ | మంటన్ | 84 | 7 | తుఘా | తుఘు |
| 25 | 19 | టలె | టక్ | 86 | 24 | టరీ | టరులీ |

89 వ పేజీ 25 వ పంక్తిలోగల "ల్" న్ గా రెండున్ను మార్చుకోవలెను.

98 వ పేజీ 9 వ పంక్తిలో గూడా "ల్" న్ గా మార్చుకోవలెను.

